అభినవసరస్వతి.

సంపుటం 5 | జూనపాడు ప్రమాదీచ సం|| భాద్రపదమాసము. | సంచిక 9.

## విచిత్రవివాహములు.

———○○○———

అగష్టుసంచికయం దేకాహాదీక్షతో గుళ్లలోఁ జేసెడి పెండ్లిండ్లు నింద్యములనియు లుబ్ధబుద్ధులై యిట్టియకృత్యమునకుఁ జొరఁబడిరనియుఁ జేయఁబడిన "విద్వత్సభాపరిష్కారము ప్రచురింపఁబడియె-ఈ యేకాహాదీక్ష గుళ్లలోఁబోయి తుదకుఁ బడగుటింటిగోడకుఁ బెట్టిన వెంకటేశ్వరులబొట్టువద్దను జిత్రపటములవద్దను బాహాటముగ నైపోవుచుంట యందఱెఱింగినదే-ఇంతకుమిక్కిలిగూడఁ గొన్ని యకృత్యములు బైలువెడలినవి, నిజాంమిలాకా నల్లగొండజిల్లా హుజూరునగరముతాలూకా గొర్లగూడెములో, 'ఓరుగంటికృష్ణయ్య' యను నొకబ్రాహ్మణుఁడు కలఁడు నష్టభార్యుఁడగు నాయనపుత్రి మాతామహియగు 'యాతవాకిళ్ల' వాసిని బాచిమంచి సీతమ్మచేఁ బెంపఁబడుచు నామెయింటనే యుండఁ దండ్రి యాకన్యను బదులుకుబదులిచ్చి తాఁ బెండ్లియాడనిశ్చయించికొని యొకనాఁటిసాయంకాల మాసీతమ్మతోఁ జెప్పివచ్చుటయు నాసీతమ్మ యాపిల్లను దనమఱఁది కొమరునకుఁ బెండ్లిసేయనిచ్ఛకలదగుట నమరవరమందుండిన పిల్లవానినిదీసికొనిరా వెంటనే భృత్యునిదఱిమి యది యొరాత్రి పిల్లను సమీపమందేయుండిన కృష్ణాజిల్లా నందిగామతాలూకా నడిగూడెము చేర్చి యాయూరిదేవాలయమునఁ బెండ్లి కాజ్ఞయిండని యచ్చటిజమీందారుగుమాస్తాల నడిగెనఁట-దొరవారు లేకునికి గుమాస్తాలీదొంగపెండ్లి కిచ్చుటపీలుపడదని చెప్పినమీఁద నాయూరిసివారులోనేయుండిన "బృందావనపుర' మను రెండుగుడిసెలుగలయొకపల్లెలో నియంజనేయులవద్దకుఁ జేరి సమయమునకు వరుఁడు రామిఁ దెల్లవారిన నీదొంగతనము బైటఁబడుననియుఁ బిల్లతండ్రివచ్చి యాటంకపఱచు నని

యు వరునిచార్జీ తానేతీసికొని యాయర్ధరాత్రి కన్యకంఠమున మంగళ సూత్రముకట్టి తననెత్తిని గన్యనెత్తిని రెండక్షతలు తానేవేసి వెలుఁగు నకో యగ్నిసాక్షికమునకో పెట్టిన వరిగడ్డిమంటతో వివాహముకాము గించి నడిగూడెముచేరినతర్వాత మఱునాఁడు జాముప్రొద్దెక్కుసరికి వరుఁడువచ్చెనఁట,అప్పుడు పట్టుపట్టుమని యొకకొట్టుమీఁద మధుపర్క ములుతీసికొని యామిథ్యాదంపతులకుఁగట్టబెట్టి పిల్లవానిమెడలో రెండ వజందెమువేసి తలగఁగుగులుకావించి యపౌపాసనకుఁగూర్చుండఁబెట్టెనఁ ట-ఆసరికిఁ దండ్రివచ్చి పిల్లమెడలోని మంగళసూత్రము తెంపివేసి తీసి కొనిపోయి యిదివఱకైనపెండ్లి పెండ్లికాదనియు నీయిష్టమువచ్చినవా నికి మరలవివాహముసేయవచ్చుననియుఁ బలుగ్రామములబ్రాహ్మణుల దస్కతులతో నొకపత్రముంగైకొని సర్వవరగ్రామవాసియగు ద్రోణా సోమయ్యగారితమ్మునకిచ్చి విధ్యుక్తముగ వివాహముచేసెనఁట-అదిజరి గినది బ్రాహ్మణబాహుళ్యములఁ చిలుకూరివారి యగ్రహారములోనఁ ట,చేయించినది బేతవోలునివాసులగు వెలమకన్ని సీతారామయ్యగారఁ ట,ప్రకృతమాసీతారామయ్యగారీ వాస్తవవధూవరులపై నేకారణము ననో యిష్టములేని శ్రీబేతవోలుదొరవారియాజ్ఞానుసారము పెండ్లి నేనుజేయించలేదనిచెప్పుచున్నారఁట, దొరవారీవిధ్యుక్తవివాహమున కేప్రతికూలురై వెనుకఁ బోచెంచెర్లవారిపైపలెఁ గక్షవహించిరఁట విధివిహీనముగద్వితీయయజ్ఞోపవీతధారణచేసి తిరుగుచున్న యబద్ధపుఁ బెండ్లికొడుకు శుద్ధుఁడట-యథార్థవరుఁడు కాఁడఁట-అట్లని బేతవోలున కుసంబంధించినవారీసోమయ్యప్రభృతులఁబంక్తిబాహ్యులఁజేయఁజూ చుచున్నారు-ఈవిషయమున మతగురువులు దూరస్థులగుట విచారింప కపోవుటయు దేశముఖుదేశపాండ్యాలు పట్టించుకొని క్రిందుమీఁదుచే యుటయు శోచనీయము-ఈప్రస్తావనమీఁదస్మృతికివచ్చి విశ్వావసుసం వత్సరమున నేను శ్రీబేతవోలుదొరవారికివ్రాసిన 50 పద్యములుగల యుత్తరములోని కొన్నిపద్యములుకూడనిందుఁ జదువరులవినోదార్థమై యుదహరించుచున్నవాఁడను.

ప॥ అ॥

శా॥ మీ యాస్థానమునందుఁ బూజవడయన్ మేకొన్నతర్వాతఁగా
నాయర్థాంగిజనించె, నిప్డిపుడు తన్నాళీకపత్రాక్షికిన్
బ్రాయంబాయ్యనవచ్చుచున్న, దది యే పాపంబొ యేమో ప్రభూ!
నాయిష్టార్థములభ్యమౌచుఁ జనెడిన్ నానావిధానర్థమై॥ 2

ఉ॥ పండితపక్షపాతివగు బ్రాహ్మణభూపతివీవు నాదుపై
నిండిన ప్రేమగల్గి తమి నిన్ గనవచ్చినయప్పుడెల్ల వే
రెండొ యొకండొ యిచ్చి తగురీతిని సత్కృతిసల్పుచుండ నా
ఖండలుఁ డంతవాఁడనికఁ గావుటకుండునె సంశయంబిలన్ 11

తే॥ గీ॥ ఆశ్రయింపంగఁబడినట్టియధిపులెల్ల
రిక్తసత్కృతిసల్పుచో నింతవఱకు 12
రెండుచేతులఁదినికొంచు మండలేంద్ర!
యంచితాఖండలపదంబె కాంచుచుంటి॥

మత్తకోకిల॥ రచ్చదీరిచి వేశ్యకాంతల రాగనృత్యపరీక్షలన్
హెచ్చిచేయఁగఁదీఱగాని మహీశ!యత్యనురక్తిచే
నిచ్చవచ్చినవర్ణనాంశములిచ్చి చెచ్చెరఁజెప్పుచో
మెచ్చు చష్టవధానముంగన మీకుఁదీఱకపోయెఁగా॥ 25

ఉ॥ ఏనరుదెంచిపో నవల నేడుదినాలకెకాదె శ్రీమదా
స్థానముచేరవచ్చినది తాఁ దమి నట్టువరాధ, దానికిన్
గానసభంబొనర్చి బలుకట్నములీయఁగనున్న స్వాస్థ్య మా
హానృప!యెందుఁబోయెఁజెపు మష్టవధానసభం బొనర్పఁగన్॥ 26

చ॥ విసువక యెల్లవేళలను వేశ్యలొనర్చెడియాటపాటలే
వెసఁగనుగొంచు బ్రాహ్మణులవిద్య లనాదరణంబుసేయుటల్
రసికతలేని మూఢులగురాజులకుందగుఁగాని భూపతీ!
రసికవతంసులైనతమరా? ఇటువంటిపనుల్ ఘొనర్చుటల్॥ 27

# IV

సీ॥ పుట్టుకచూతమా భువనప్రసిద్ధమా
గోల్కొండవ్యాపారికులమునందు
ప్రభుతవీక్షింతమా బహుసంవసథముల
దయనేలఁగల జమీందారుపదవి
భాగ్యమీక్షింతమా బలునందలములోని
యంఘ్రి క్రిందికిదించనంతపాటి
వేత్తృతగందమా వివిధవిద్యలలోనఁ
బలుపండితులకును దెలుపునంత

గీ॥ ఇట్టిమీచిత్తమునకు మాయట్టిచెట్ట
పుట్టుబీదలుపడెడియిక్కట్టు తెలియఁ
గలదె, హా రాజశేఖర! "కడుపునిండి
నమ్మ మగనాక లేమెఱుఁగు"నవెడిరీతి

సీ॥ దాతలో దూతలో తర్వాత, వారల
దర్శింప నూరూరు తరలవలయు
తరలిదర్శించినతర్వాత వారి మీ
"రింద్రులు చంద్రులం"చెన్న వలయు
ఎన్నుచోనవ్వార లెడమోము పెడమోము
పెట్ట, ఖిన్నతి లోనఁ దిట్టవలయు
తిట్టియంతటఁబోక దీనతం బలుమాఱు
వారియిల్ తిరిగి వేసారవలయు

గీ॥ తిరిగి వేసారింగాని తెలియదింత
కట్టొ బుట్టొ మహీపాల! యప్పటికిని
యాచ్నయాచ్నయనంగ మీయాత్మలోన
నేమియనుకొంటరో మీర లేమొకాని



కావున సత్యవిషయం బెంతమట్టుకు పలుకుదలఁచినను డాఁగదు. ఏవేళనో బయల్పడకమానదు. శ్రీవేమవరాగ్రహారమందు జరిగిన శతావధాన సభనుగూర్చి యీసంవత్సరము 22 జనేవరి తేదీగల యాంధ్రపత్రికయందును 8-15 ఫిబ్రేవరు తేదీలుగల కృష్ణాపత్రికలయందును గొన్ని సత్యాసత్యములు మిశ్రితములుగాఁ బ్రకటింపఁబడినవి. అందలి విషయము లెంతవఱకు సత్యములో ఎంతవఱకుఁగావో విచారింపందగును.

శ్రీవేమవరాగ్రహారమందు బ్రహ్మశ్రీ భాగిచెన్నయ్యగారి గృహంబునఁ దిరుపతి వెంకటకవులు అవధాన మొనర్చిరను విషయమును వెంకటశాస్త్రిగారా యవధానమందు నేఁబదిమంది పృచ్ఛకులకు మొదటిపాదము చెప్పిరను విషయమును దక్కిన మూఁడుపాదములు తిరుపతిశాస్త్రిగారు చెప్పిముగించిరను విషయమును, ఈయవధానప్రారంభమందు వెంకటశాస్త్రిగారు 1 "సమస్యలడుగువారు" ఇఁకఁబదిమంది తరువాయియుండిరను నప్పటినుండిగాని మొదటనే అడుగ మొదలిడఁగూడదు. 2 శబ్దాడంబర ప్రధానములుగాని మఱియొకరీతివిగాని సంస్కృతశ్లోకములు తెనిగింపుమనికోరరాదు. 3 ప్రాసాదినియమములు పృచ్ఛకులు సేయరాదు. అలంకారనియమమునట్లే. 4 మాఱుమూల వృత్తములు తఱుచుగనడుగఁగూడదు. 5 వృత్తమును వర్ణనయును మాత్రమే కోరవలయునుగాని లేనిపోని కొకిబికికోరికలు పనికిరావు. అనునీనియమ పంచకమును సభవారికిఁ దెల్పియున్న విషయమును, వారేర్పఱచిన నియమములుదప్పి పృచ్ఛకు లెవరును నేమియును నడుగరాదని యగ్రాసనాధిపత్యము వహించిన నేను వ్రాక్రుచ్చి నాఁడనను విషయమును, ఈయవధానమును సందర్శింపవచ్చిన మహాజనసంఘ

మునకు భాగి చెన్నయ్యగారి గృహంబున నాల్గుదినములు విపులముగ సంతర్పణ జగిగినదను విషయమును సత్యములనుట కేసంశయమును లేదు. ఇకనసత్యములెవ్వియన:—

(1) ఈసభ కొప్పరపుఁగవిసోదరులకును దిరుపతివేంకటకవులకును సంధికుదుర్చుట కేర్పడిన దను మాట యసత్యము:— ఇట్టి సంధికుదుర్చుటకు నీ సభ యేర్పడినదను వార్తయే సత్యమయినఁ గొప్పరపువారి యందభిమానము గలట్టియు, ఏతత్కలహోత్పత్తిస్థానమైన గుంటూరునందలి నివాసులైనట్టియు, విద్వద్బృందమేల విశేషించిరాకుండును? వేంకటశాస్త్రిగారు తమకును గొప్పరపువారికిని సంభవించిన వివాదవిషయము నధికరించి "గుంటూరుసీమ" యను గ్రంథమును రచించుచున్నారనుట జగమెల్ల దెలిసియుండఁగ నిట్టిసంధికు దురఁబోవునని తలంచువారెవరుందురు? సభకు నచ్చినవారిలోఁగొందఱకిట్టి భ్రాంతి కలిగినఁగలుగుఁ గాక, ఆభ్రాంతికి నాధారమెంతయును గనంబడదు. తిరుపతివేంకటకవుల యశస్సు మాఱుమూల పల్లెలయందుఁగూడ వ్యాప్తమై యుండుటంజేసి యామహాసంఘము విచ్చేసినది గాని సంధికొఱకై యీసభ యేర్పడలేదు.

(2) ప్రథమపాదమునే చెప్పునపుడు పృచ్ఛకులడిగిన వృత్తములు, విషయములు, వేంకటశాస్త్రిగారు తాఱుమాఱుసేసిరనుమాట, కడుసాహసము, కేవలమసత్యము, వీరుబహువేగముగఁజెప్పిరేకాని, యడుగడుగునకు సంశయము నేమాత్రమును జూపలేదు. వీరి సామర్థ్యమెఱింగిన నిష్కల్మషచిత్తులిట్టిమిధ్యోక్తుల నుడువ నుద్యమింపరు.

(3) "కొన్నిప్రశ్నలను విని తమ శిష్యులును పట్టాభిరామశాస్త్రిగారును వ్రాసికొనిన తరువాత రేపు చెప్పెదమనిర"న్న వాక్య

మున కాస్పదమే లేదు. చెప్పఁదలఁచిన నేఁబది ప్రశ్నలకు మొదటిపాద మును మొదటినాఁడే చెప్పినట్లు పత్త్రికలే ఘోషించుచున్నవి. వ్యవధి లేక తక్కిన ప్రశ్నల కుత్తరములను మఱునాఁడు చెప్పెదమని యని న నని యుండునేమో యని యనుకొనందగును. ప్రారంభమందే, నేను నామిత్రులు మఱికొందఱును, కొన్ని కారణములచేత నేఁబది ప్రశ్నలతోడనే యవధానమును ముగింపుఁడని కవులంగోర వారంగీకరించియుండిరి. అవధానాంతమందుఁ బైని సూచితములైన నియమములలో నైదవదానిప్రకారము చెప్పవలసిన పదిసమస్యలు మొదటినాఁడే ప్రారంభమయ్యెను. కనుక రేపుచెప్పెదమనుట కవకాశములేదు.

(4) "కొందఱిచ్చిన సమస్యలను; వృత్తములను, శబ్దములను, మీరడిగినట్లు మేము చెప్పలేము" అని యన్నమాట వెంకటశాస్త్రిగారు పరిహాసమున ననిరన్న సత్యమగునేమోకాని వాస్తవముగా నిట్టి యసమర్థదీనాలాపములాడిరనుట కల్ల. వాస్తవ పరిహాసభేద మెఱుఁగని యమాయిక మందబుద్ధియో. పరిహాసోక్తుల వాస్తవముగా నిరూపించి పరులయందశక్తతను గల్పింపఁబూనిన యసూయాగ్రస్తచిత్తుఁడో యిట్టివార్తకుఁ గారణభూతుఁడై యుండును.

(5) 1913 సం॥ రం ది 22 జనవరి తేదీగల యాంధ్రపత్త్రిక యొక్క 15 వ పేజీ మొదటికాలం (Column) లో నడుగుభాగమందు "అంతట పృచ్ఛకులలోఁ గొందఱుఁ మీరుభయభాషా కోవిదులమనియు, ఎవ్వానిని లెక్కపెట్ట కనివారణధిగ్విజయంబొనర్చినారమనియు, అసాధ్యవిచిత్ర శతావధానము చేయఁగలవారమనియు గ్రంథములయందు వ్రాసికొని ఇప్పుడు తద్భిన్నముగా నియమము లేర్పఱుచుకొనుట మీ వ్రాతలన్నిఁటికి విరుద్ధము లేకదా అనిరి. మఱికొందఱు దేవుసైన

లక్ష్యపెట్టము అనిన తమరు సాధారణముగా సామాన్యులయిన కవులే చెప్పఁదగిన ఇట్టిప్రశ్నలను మేము చెప్పఁజాలము. అని చెప్పకుండుటచే దేవరవారి సామర్థ్యమందఱకుఁ దెలిసినదనిరి. అంతట వెంకట శాస్త్రి గారు లేచి 'మీకందఱకును నమస్కారములు. మేముమీరుకోరినట్లు చెప్పఁజాలము. మాబుద్ధిచెడ్డది. పెద్దముండాకొడుకలమయి పోతిమి. మమ్మూరక ఏడిపించవద్దు. భాగి చెన్నయ్యగారు పిలుచుటచేవచ్చి వారి కోరికను దీసివేయలేక యేదో వేడుకగా అవధానమును జేయుచు న్నాము. క్షమింపుఁడు' అని బహువిధములఁ బ్రార్థించిరి. ఇంతమా త్రమున కేనా రెండుమీసములుంచితిరి. అని యొకరనిరి".— అను నీ వాక్యములు కాన్పించుచున్నవి. ఇయ్యవి ప్రత్తిపాటి కామేశ్వరకవి కల్పిత విచిత్రప్రసంగమేకాని. సభయందిట్టిదేదియు జరిగియుండలేదు. ఇట్టి సంభాషణమే జరిగియున్న యెడల నెంతకల్లోలము సభయందుద్భ వించి యుండవలయునో బుద్ధిమంతులూహించ లేకపోరు ఒక వేళ తిరు పతి వెంకట కవుల కహితులగువారు తమలోఁ దామిట్లనుకొని రేమో కాని యిట్టివాక్యములు సభయందేమూలను శ్రుతిగోచరంబయినట్లు తెలియదు. అల్లరికిమూలమయిన నిట్టి ప్రసంగమే జరిగినదనుకొన్నను, 'సభ కొట్టకొనవఱకును నెమ్మదిగాజరుగ నాకెట్టిబాధయుఁ గలుగలే ద'ని నేఁడెల్పుట కవకాశముండదు. వెంకటశాస్త్రిగారు గాని తిరు పతిశాస్త్రిగారు గాని పైనిసూచితములైన దీనవచనములఁ బల్కునట్టి యసమర్థులుకారు; మఱియు నట్టివాక్యములచేఁ గోపోద్దీపితులు కానం త శాంతమూర్తులునుగారు. ఈవిషయము వారి స్వభావమెఱింగినవా రికెల్లవ్యక్తమే. కనుక నిట్టిప్రసంగము జరిగింపఁబడినదన్నమాట వాస్తవముకాదు,

(6) తిరుపతిశాస్త్రిగారవధానము సల్పునపుడు వారిశబ్దముల యందు దోషములను వెంకటశాస్త్రిగారును శివరామశాస్త్రిగారును సవరించిరనుమాటయును, వెంకటశాస్త్రిగారవధానకాలమందు తుమ్మెదపాటపాడి తిరుపతిశాస్త్రిగారికికందపద్యమని యందిచ్చినసంగతియును నిజములుకావు. వెంకటశాస్త్రిగారు మొదటిపాదములు చెప్పివారచ్చటచ్చట సంచారము చేయుచుండిరికాని, క్రమముగాఁ దిరుపతిశాస్త్రిగారి వాక్యములను ధారణపట్టఁబూనినట్లు కాన్పించదు. అదిగాక వారు స్వయముగా నవధానము చేయునపుడు వృత్తవర్ణనములు తాఱుమాఱు సేసిరని యసమర్థత్వారోపణము సేయుచును, నితరులకు సాయమొసర్ప సమర్థులని వాక్రుచ్చుట, యెంతసమంజసము! ఈతుమ్మెదపాట నేనెంత శ్రద్ధతో నవధానమును వినుచున్నను, అవధానకాలమందు నాచెవిం బడదయ్యె. అవధానసభ జరుగనప్పుడు కొందఱుపెద్దలును దిరుపతివెంకటకవులును చెన్నయ్యగారిగృహమందే సభగాఁగూడియుండుట పలుమాఱులు తటస్థించినను, నేబసయందుఁ గార్యాంతరనిమగ్నుండనైయుండుటంజేసి యాసభలయందెప్పుడో, యొకప్పుడు దప్ప నేనుండలేదు. అట్టి వినోదప్రసంగములు జరిగించు సమయములలోఁ దుమ్మెదపాట పాడియుండుట వాస్తవమైయుండునేమోకాని, అవధానకాలమం దీపాటపాడిరన్నవార్త కేవలమబద్ధము

(7) ఈయవధానమునకంతకును 12½ గంటలు పట్టినదనుమాట, యితరులతోపాటు విరును జేసిరేకాని వీరియందేమివిశేషమును లేదనిచెప్పుటకుఁ గల్పించినయనృతము. మొదటిదినమున సాయంకాలము 4 గం॥ 30 నిమిషములకు సభప్రారంభమయి 7 గంటలకు ముగిసినది. రెండవరోజు ఉదయము 9 గంటల 15 నిమిషములకుఁ బ్రా

రంభమయి 11 గంటల 30 నిమిషములకు ముగిసినది. మఱియు నాఁడె నమునసే సాయంకాలము 5 గంటలషుమారునకుఁ బ్రారంభమయి 7 గంటలకుఁ బూర్తియయినది. మొత్తముమీఁద 6¼ గంటలు పట్టిన ది. ఇందులో నవధానాంతమందు పద్యములుచదువుకాలము షుమారు ¾ గంట తీసివేసిన 5½ గంటలలో నీయవధానము పూర్తియైనదని చెప్పవచ్చును. ఒకవేళ తిరుపతి వెంకటకవుల స్తుతించిన పద్యములు చదివినకాలమును, వెంకటశాస్త్రిగారి శిష్యచూడామణులలో నొకర గునవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆశుకవిత్వము చెప్పినకాలమును అగ్రాసనాధిపతి యుపన్యాసమిచ్చిన కాలమును గల్పికొనిన షుమారు 10 గంటలు పట్టియుండనోవు. అవధానముమాత్రము 5½ గంటలు పట్టినదనుట యేసత్యము.

(8) కొప్పరపువారిమీఁదికి మూఁడు బుజ్జపిట్టలను బంపుచు న్నాఁడనని వెంకటశాస్త్రిగారనిరఁట. ఇందుసూచితులైన వెంకటశాస్త్రి గారి శిష్యులు బుజ్జపిట్టలో ఆశుకవులో వారి కవనధోరణి నొకింతగ నిన వేమవరశతావధాన సభలోని సభ్యులు తెల్పెదరుగాక. వెంకట శాస్త్రిగారు తమశిష్యులను బుజ్జపిట్టలతోఁ బోల్చిపలుకుదురనుటకల్ల. శతావధానసభ జరుగుకాలమందుఁ గొప్పరపువారింగూర్చి యేప్రసంగ ము సేయలేదు.

ఇట్టి ప్రత్తిపాటి కామేశ్వరకవి కల్పనాచాతుర్యమును జూచి విస్మితులు కానివారుండరు. ఈకామేశ్వరుండు, తత్త్వమునుబోధింప సహకారులుగ నుండునట్లు కల్పనలురచించు సాధారణకవులపోకలం బోక నూత్నపద్ధతినవలంబించు నసాధారణకవిగాఁ గాన్పించుచున్నాఁ డు. కాకున్న సత్యమును గేవలము మాటుపఱచిన వారి వాక్యముల నుండి యసత్యపరంపరలుద్గమింపవు.

ఇఁకఁ గొప్పరపు సోదరకవుల లేఖలంగూర్చి విచారింతము.

కొప్పరపుసోదరకవులు ఈసభకగ్రాసనాధిపతిగానున్న నాపే రటికిని, మల్లాది సోమయాజులగారి పేరటికిని తాము రెండు లేఖలను వ్రాసి 1912 సం॥ డి 29 డిశంబరు తారీఖున సభాసమక్షమందుఁ జదివి విను పించుటకంపినట్లును, అంతకు వెనుకటిదినమున జరిగిన యీయవధాన సభలో మల్లాది సోమయాజులుగారు కొన్ని యసత్యములుపన్యసించి నట్లును, ఆయసత్యములు బయలుపడునను భీతిచే నాలేఖలుచదివిం ప నవకాశమొసంగఁబడనట్లును, 1913 సం॥ 8 ఫిబ్రేవరు తేదీగల కృష్ణాపత్రికలోఁ గొప్పరపువారె వ్రాసికొనిరి. ఈయుత్తరములందలివి షయము లెంతవఱకు సత్యమో, ఈ యుత్తరములుమాకు 29 తేదీ నఁ బంపించినవార్త సత్యమో కాదో, విమర్శింపవలయును.

నాకంపినామని చెప్పునుత్తరమునందు, మల్లాది సోమయాజు లుగారు కొప్పరపువారింగూర్చి యసత్యములుపన్యసించినట్లును, అ ప్పుడు నిజమెఱిఁగిన యొకరిద్దఱు లేచియిట్లసత్యములు చెప్పరాదనియు ను జరిగినదంతయు మేము తెల్పెదమనియును వెలిపి సవిస్తరముగా ని జమెఱిఁగింపఁ బూనిచెప్పుచుండఁగా నేను దగునంతటి యవకాశము వారికొసంగక నాశాసనమునకప్పీలుగూడ లేదని బెదరించినానని యు ను, మఱియు మల్లాది సోమయాజులుగారు చెప్పినదే సత్యమని నేనూ హించితినని సభలోఁ జెప్పినట్లును, వ్రాయఁబడియున్నది.

ఈయుత్తరములోని సంగతులయొక్క వాస్తవము తెలియుటకు గొంతపీఠిక వ్రాయనవసరముగానున్నది. అవధానము జరిగిన మొదటి దినమందుఁబగలు షుమారు 11 గంటలవేళ మల్లాది సోమయాజులు గారును మేళ్లచెర్వు శేషయ్యగారును చావలి వెంకటకృష్ణయ్యగారును

సోదరకవుల నాహ్వానము చేయఁ బయనమై కొప్పరమునకు వెళ్లి అచ్చటఁ గవిసోదరులతోఁ గొంతసేపు ప్రసంగమొనర్చి ఆరాత్రి 7 గంటలకు సభముగియఁబోవు సమయంబునకు వేమవరమునకుఁ దిరుగవచ్చిరి. వెంటనే సోమయాజులుగారు సోదరకవులు సభామధ్యమందుఁ జెప్పుడని చెప్పినసంగతుల నుపన్యసింప నాసమ్మతింగొని వారు సభామధ్యమందుఁ బ్రసంగించుచుండ ధూళిపాళ్ల నరసింహముగారు లేచి తామేమొ చెప్పుదుమని యవకాశమీవలయునని నన్నడుగ 15 నిమిషములవఱ కుపన్యసింప నేసమ్మతించినను రెండు మూఁడు నిమిషములెక్కువగనే యుపన్యసించినారు. ఇతరులెవ్వరు నవకాశమొసంగమని యడిగినవారు లేరు ఈధూళిపాళ్ల నరసింహముగారును సోమయాజులుగారు చెప్పిన సంగతులయందలి సత్యాసత్యముల నెఱింగి తదుపన్యాసమును ఖండింపఁబూనుకొనలేదు. అట్లుపూనుకొనినట్లు వారుచెప్పను లేదు. వారి యుపన్యాసమువలన నట్లనుకొనుటకే హేతువును గాన్పించదు. వారు కొప్పరపువారియొక్కయు చెన్నయ్యగారియొక్కయు నుద్దేశ్యములంగూర్చి ముచ్చటించిరి. కొప్పరపువారిని మనఃపూర్వకముగా చెన్నయగారాహ్వానము చేయనట్లును ఆహ్వానము చేయుటలోఁ దగినట్లు కొప్పరపువారిని గౌరవించనట్లును వీరు తమయభిప్రాయమును వ్యక్తీకరించిరి. ఇంతియకాక, కొప్పరపువారికి మొదటఁబంపిన యాహ్వానపత్రికయందు బ్రహ్మశ్రీయని లేక మహారాజశ్రీయని యుండుటఁ జేసియు ననంతరము 'బ్రహ్మశ్రీ' యను బిరుదుతో మఱియొక లేఖ సాహెబుచేతఁ బంపబడుటఁ జేసియు గౌరవింపఁబడనట్లు వారెంచిరనియు, సాహెబుచేతఁబంపించినందునకుఁ బ్రతీకారముగ మాదిగవానిచేత చెన్నయ్యగారికిఁ బ్రత్యుత్తరమంపమని తాము కొప్పరపువారికి హితముపదేశించినట్లును

ఈ మొదలయిన సంగతులుపన్యసించిరి. ఈవిషయమంతయు, సోమయా జులుగారు కొప్పరము పోకపూర్వము జరిగినవిషయమై యుండునుగాని సోమయాజులుగారును గొప్పరపుఁ గవిసోదరులును గలిసి ముచ్చటించి నప్పుడు జరిగినవృత్తాంతముగాదు. కొప్పరపువారు తమకుఁదగిన గౌర వము చూపించలేదని రారనుకొని సోమయాజులుగారు మొదలైన వారు వారినాహ్వానము సేయఁబంపఁబడిరి. సోమయాజి కవిసోదర ప్ర సంగవిషయ మెంతమాత్రమును ఈఘూళిపాళ నరసింహముగారెత్తుకొ ననేలేదు. అట్లెత్తుకొనక 'సంగదోష' గ్రంథప్రసంగము తెచ్చి జ్ఞా నోపదేశప్రసక్తికిఁ గారణముకల్పించుచుఁ గాలహరణంబుసేయఁ బాలు పడిరి. ఇంతియకాక యీయన యీవిషయమెఱింగి యుండరనుటకు ను నిదర్శనములు కలవు. మొదటిదినమున అవధానసభ ప్రారంభమ గుటకు షుమారు ఆఱుగంటలకుముందు సోమయాజులుగారు కొప్పర మునకుఁబోవఁ బయనంబై వెడలునపుడు వేమవరగ్రామముయొక్క పొలిమేరయందు ఈనరసింహముగారెదురైరఁట, ఒకవేళ సోమయా జులుగారు బయలుదేరినప్పుడె వేమవరమునుండి మూఁడుక్రోసుల దూ రమునందున్న కొప్పరమునకుఁ దిరుగవెళ్లి నరిసింహముగారు సోమయా జి కవిసోదరప్రసంగము వినినారని యనుకొనవలయునన్నను, సోమయా జులగారితోపాటు ఆయనయు సభాంతమందు వచ్చియుండవలసినదేకాని నాఁడుసాయంకాలమందుఁ బ్రారంభమయి రాత్రి 7 గంటలవేళ ముగి సిన యాసభయందేల వారుందురు? అందువలన సోమయాజులగారి యుపన్యాసమునుఖండించి సత్యమెఱింగింప నీనరసింహముగారి కవకా శమేలేదు. ఇట్టిచో "నిజమెఱిఁగిన యొకరిద్దఱు లేచి యిట్లసత్యములు చెప్పరాదనియును జరిగినదంతయు మేము తెల్పెదమనియును దెల్పి సవి స్తరముగా నిజమెఱింగింపఁబూని" రనుట కేవలమబద్ధమని వివేకవం

తు లరయకపోరు. ఈనరసింహముగారుగాక యట్టిసత్యమెఱిఁగిన వా రెవరో కొప్పరపువారు తమరెండు లేఖలందును సూచింపరు. అట్టివారు గగనకుసుమములనుట కేమిసందియము? గగనకుసుమమున్నదన్న వారు, దానియందలి వాసనాదులనెట్లు సాధింతురో, యట్లే యట్టిసత్య వాదుల కుపన్యసింపనే దగినంతయవకాశ మీయకుండుటయు, నాశా సనమున కప్పీలుగూడ లేదని బెదిరించితిననుటయు, సోమయాజులుగారు చెప్పినదే సత్యమని నేనూహించితిననుటయు ననునీవిషయములను సా ధింపనగును.

పై విషయములందలి వాస్తవమేమన:—

సోమయాజులుగారు కొప్పరపువారికిని దమకును జరిగిన ప్ర సంగములోని ముఖ్యాంశములం జెప్పనెంచి "(1) కొప్పరపువారికి మొదటవ్రాసిన యుత్తరమునందు మహారాజశ్రీ యున్నదనియు బ్ర హ్మశ్రీ లేదనియు ననెడివిషయము సభకు వారు రానందునకుఁగారణ ముకాదనియు (2) ఆకొప్పరపువారి కాహ్వానపత్త్రిక సాహెబుచే తేఁ బంపఁబడినసంగతి వారెఱిఁగియుండ లేదనియు, దానికెట్టిప్రత్యుత్త రమును చెన్నయ్య గారికి వ్రాయించ లేదనియు (3) వారికిని దిరుప తివేంకటకవులకును వివాద మేర్పడియున్నందునఁ దిరుపతివేంకటకవుల కొఱకై కూర్చిన సభకు రామని వారనిరనియు (4) వారికిని దిరుప తివేంకటకవులకును దారతమ్యమును విచారింపఁబూని చేర్చిన సభకే వారు వత్తుమనిరనియు (5) వారు బదులు గ్రంథములు రచింతుమ ని చెప్పినారు గనుక గుంటూరుసీమను పబ్లీషు చేయవలదని దిరుప తివేంకటకవులను వారింతుమని చెప్పినామనియు, (6) తమరిని త మతోవచ్చిన మఱియిద్దరిని సగౌరవముగా నూరివెలుపటివఱకు వారు

సాగనంపిరనియు మొదలైన సంగతులను ఆ సోమయాజులుగారుపన్య సించిరి. అందుమీద సోమయాజులుగారు కొప్పరపువారి కహితము లైన వాక్యములెవ్వియుఁ జెప్పియుండనందున నాసోమయాజులుగారు కొప్పరపువారి విరోధియని భ్రాంతిపడుట కేవలము తప్పనియును, అటుగాక కొప్పరపువారిపక్షము వారేయని భావింప నర్హులనియును, వారి వాక్యములు సత్యమనియే నానమ్మకముగాన నాదరణీయము లేయనియు నేనుడివి యప్పటిసభ ముగించితి. ఇతరులు చెప్పినది యసత్యమనితోఁపఁజేయు నుద్దేశ్యముతో సోమయాజులుగారు చెప్పినదే సత్యమని ఏవకారార్థము ప్రయోగించియుండుట కవకాశము లేనప్పుడామాట నేననుట యసంభవము.

“ నా శాసనమునకప్పీలులేదు ” అని నేనన్నవిషయము నిజమే కాని యీవాక్యములు మల్లాది సోమయాజులగారి యుపన్యాసకాలమందనియుండలేదు. రెండవదినము ఉదయమందు “ వెనుకటిదినముసాయంకాలమునఁ బ్రథమపాదములందిన యేఁబదిమంది పృచ్ఛకులతోడనే యవధానము ముగింతురా ? లేక మఱియింకొక యేఁబదిమంది పృచ్ఛకులం జేర్చుకొందురా ? ” అని కొందఱు సంశయముతోనుండిరి; పృచ్ఛకశతకంబంగీకరించిన నయిదాఱుదినములు పట్టుననియు, నన్నిరోజులు దినమునకు సహస్రముకంటె నెక్కువమందికి సంతర్పణ జరిగింపచెన్నయ్యగారి యానుకూల్య ప్రాతికూల్యము లెట్టివో విస్పష్టముగఁ దెలియఁజాలకయు, మోమోటము చేత నొకవేళ చెన్నయ్యగారు సంపూర్ణశతావధానమున కంగీకరించినను వారికి నమితధనవ్యయక్లేశము కలిగించినవారమగుదుమేమో యనియు, భీతిల్లి యేఁబదిమంది పృచ్ఛకులతోడనే యవధానము ముగింపుసేయుటకు మొదటిదినమందే

# CVIII

నేనును నామిత్రులును జేసికొనిన యేర్పాటును రెండవదినము ఉదయ సభాప్రారంభమందు నేను దెల్పినాఁడను. అట్లు దెల్పునపుడు నన్ను మధ్యవర్తిగా సభ్యులేర్పఱచుకొన్నందున నాశాసనమున కప్పీలుగూడ లేదనియు నుడివితి. ఊరక మొండిపట్టుపట్టి కొందఱు మఱికొన్ని ప్రశ్నలకంగీకరింపుఁడని కోరుదురేమోయని సంశయించి యిట్లంటినిగాని బెదరించుతలంపుతో ననలేదు. కొప్పరపువారిట్లనవలసి యనియుండిరేకాని, నాకున్న యప్పటియధికారమునుబట్టి నావాక్యములు బెదరింపులు కానేరవనునంతమాత్రము గ్రహించియుండకపోరు

కొప్పరపువారిని వారి ప్రతిపక్షులగువారు పరిహసింప నేనుపేక్షించినట్లు వ్రాయఁబడియున్నది. అవధానసభలో మల్లాది సోమయాజులుగారి యుపన్యాస సమయమందుఁ దప్ప నితరసందర్భములఁ గొప్పరపువారి ప్రసంగమేరాలేదు. సభాధిపత్యము నంగీకరించుటకుఁ బూర్వమే తిరుపతి వెంకటకవులు తామురచించుచున్న 'గుంటూరుసీమ' యనుగ్రంథమును జదివిగాని మఱియేవిధముననైనఁగాని కొప్పరపువారి ప్రసంగము రానీయకుండఁ గట్టడి యేర్పఱుచుకొనవలయునని నన్నుఁ బిలువవచ్చిన బ్రహ్మశ్రీ రంగావఝ్ఝల హనుమయ్యగారిని బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారినిఁగోరియుంటి.ఏకారణము చేతనైననేమి తిరుపతి వేంకటకవులు కొప్పరపువారి ప్రసంగము తెచ్చియేయుండలేదు. మల్లాది సోమయాజులుగారి యుపన్యాసాంతమందు తిరుపతిశాస్త్రిగారు 'జీవించియుండులోపలఁ గొప్పరపువారి పరాభవమును జూడకమానను" అను తీక్ష్ణవాక్యమొక్కటిమాత్రమని యున్నారు. కొప్పరపువారికిని వీరికిని సామర్థ్యముల భేదము విమర్శింపఁబూని కూడినసభకైనచో గొప్పరపువారు వత్తురని చెప్పినపుడు

ఇట్టి తీక్ష్ణసమాధానమిచ్చుట అనుచితము కాదు. తిరుపతిశాస్త్రిగారు కంఠమెత్తి యావాక్యములన్నప్పుడు అందఱు వితాకువడిరిగాని, అల్లరి యొంతమాత్రము జరిగియుండలేదు. మఱియుఁ దిరుపతి వెంకట కవుల నుతించుపద్యములలోఁ గొప్పరపువారిం గూర్చి సూచనలుండినప్పుడు, కూడదని నేను వారించితిని. కొప్పరపువారి నిందించి వారియందు వృథాదోషారోపణ మొనర్చిన వారెవ్వరో నేనెఱుంగఁజాలను. తిరుపతి వెంకట కవులయందత్యంత మసూయంజూపిన కామేశ్వరకవి పుంగవుండును కొప్పరపుఁగవిసోదరులం గూర్చి నిందాప్రసంగములొనర్పఁ బడినట్లిట్టి సూచనయుఁ జేయఁడు. ఆకామేశ్వరకవి కొప్పరపువారియందభిమానముగలవాఁడనుట కెవ్వరును సందేహింపరు. ఇట్టిసంగతులలోఁ గొప్పరపువారు పరిహాసితులగుచుండ నేనుపేక్షించితిననుట యవిశ్వసనీయము.

కొప్పరపువారియం దెట్టి వృథాదోషారోపణ మెవ్వరుగాని సభ జరుగుకాలమునఁ జేయకున్నను, నాపైమాత్ర మట్టి కృత్యము జరుపఁబడినది. రెండవరోజు నుదయమున సభముగియునప్పుడు, వెనుకటిసాయంతనమందు నియమములందప్పించి ప్రశ్నపైప్రశ్నల నడిగియున్నట్టియు, నాకుఁ బేరు తెలియనట్టియు నొక కలహప్రియుఁ డగు గాఁడోఁచు చిన్నవాఁడు ఈక్రిందివాక్యములుగల యొక లేఖనా చేతికి స్వయముగా నిచ్చియున్నాఁడు. ఆలేఖవివర మెట్టిదన:—

"అయ్యా! అగ్రాసనాధిపా! చాలామందిని యోగులు యీసభకువచ్చినారు- వారిలో చాలామందివద్ద చాలాప్రశ్నలున్నవనిన్నీ- ఆప్రశ్నలు ప్రశ్నించగా వారిని నివారించినారనిన్నీ- అందరు పృచ్ఛకులున్నైదికులుగా యేర్పరుచుకున్నారనిన్నీ- అన్నీ సంపూర్తి చేయగలట్టి

వృత్తములే అనిన్ని-అడిగినయెడల వారించడమే ప్రాధాన్యముగావున్న దనిన్నీ-సంపూర్ణశతావధానమని విన్నా మనిన్నీ తగినప్రశ్నలడుగుటకు అవకాశమిచ్చెదరనే వుద్దేశ్యముతో వచ్చినామనిన్ని- ఆప్రశ్నల అడుగనివ్వక నివారించుటనుబట్టి- తమవారినే పృచ్ఛకులుగా యేర్పఱుచుకొని యెట్లెట్లో అవధానము పూర్తిచేసుకో నిశ్చయించుకున్నట్టు కనపడుచున్నదనిన్నీ- పెద్దలు చెప్పుటబట్టి తమకు వ్రాయసమకట్టితి- వ్రాసినందుకు - క్షమార్పణ.

ధూ॥ వె॥ న॥"

ఈయుత్తరమును నేను సభవారికి వినిపించి గ్రామమునకుఁ గ్రొత్తవాఁడనగుటచే నందలి సభ్యులలో వైదిక నియోగి భేదము తెలియ నాకవకాశము లేనందున నాయందీలేఖకుఁడు ఆరోపించిన దోషములేదనియు, సంపూర్ణశతావధానము జరుగునను నాసతో వచ్చినను వెనుకఁజెప్పిన కారణములచేత (ఆయుదయపుసభ ప్రారంభించునపుడు చెప్పఁబడినవి) నట్టిపనిజరుగ వీలులేదనియును జెప్పితి. వారింపఁబడిన ప్రశ్నలు మూఁడో నాల్గో యయియుండును. అవెవ్వియో జ్ఞప్తికిరావు; అవి వెంకటశాస్త్రిగారి నియమపంచకము ననుసరింపనివి. ఈలేఖనిచ్చిన కుఱ్ఱవాఁడే నియమవిరుద్ధములైన ప్రశ్నలనడుగు వారిలో మొనగాఁడు, ఇతఁడిచ్చినట్టియు నితఁడు తిన్నఁగా జదువలేనట్టియు నొక సమస్యయును పూరింపఁబడినది. పృచ్ఛకులందఱు తిరుపతివెంకట కవులకు హితులన్నమాట యసత్యము. వారి (తిరుపతివెంకటకవుల పక్షమువారి) కనిష్టముగాఁ గొందఱు పృచ్ఛకులుగా నతిప్రయత్నము మీఁదఁగూరుచుండిరి" యని సెలవిచ్చిన ప్రత్తిపాటి కవిశిరోమణులే యీవ్రాత నిజముకాదని దెల్పుచుండ వేఱొండుసాక్ష్య

మేల? ఈయుత్తరము చదివినమీఁదట సభముగించితినని చెప్పినను పట్టినపట్టువదలక యేమేమో యాచిన్నవాఁడు నాసమీపమున నిలిచి ప్రసంగింపఁబోవ వారింపఁబడినాఁడు. అప్పుడొకింత సంక్షోభము కలిగినను గొన్ని నిమేషములలోనే యాఁగిపోయినది. ఈచిన్నవాఁడు ను గొప్పరపువారి యందభిమానము గలవాఁడుగాఁ గాన్పించినను వారింగూర్చిన నిందాప్రసంగముల నేనుపేక్షించినట్లు తానిచ్చిన యుత్తరమునందు తెల్పఁడు. కనుకఁ దమ్మురు ఎవ్వరును వేమవరావధాన సభయందు నిందింపలేదని నిశ్చింతతోఁ గొప్పరపుఁగవి సోదరులుండనగు.

ఇఁకను మల్లాది సోమయాజులుగారుపన్యసించిన సంగతులెంత యసత్యము కలవియో యెఱుఁగందగును ఈసంవత్సరము 15 ఫిబ్రేవరు తేదీగల కృష్ణాపత్త్రికయందలి కొప్పరపువారిలేఖలో (1) సాహెబుచేతికిచ్చి పంపించిన యుత్తరముసంగతి సోమయాజులుగారి వలన ఁదమకుఁ దెలిసినట్లును (2) ఉభయులం (తిరుపతి వెంకటకవులను గొప్పరపువారిని) గూర్చినసభకు, ఓడినవారికవమాన మొనర్పఁబడునని నిర్ణయింపబడినయెడలఁ దాము రాఁదలఁచినట్లును (3) అట్టిసభ తమకును సోమయాజులుగారికిని ప్రసంగము జరిగిన మఱునాఁడైనను, ఈజన్మాంతమువఱకెప్పుడైనను వచ్చి శత్రువులమీసములు దీయింతుమని తాముప్రతిన కట్టినట్లును తిరుపతివెంకటకవులచే విరచితంబైన గుంటూరుసీమయను గ్రంథము ప్రచురింపఁబడక పూర్వముకాని, కాకున్న గుంటూరుసీమయు, దానికిఁ బ్రతిగాఁదముచేఁ బ్రచురింపఁబడఁబోవు జల్లిసీమ, నారాయణాస్త్రము అనుగ్రంథములన్నియు బయలువెడలిన వెనుకగాని పైనిసూచితమైన వివాదసభ జరుగవలయుననియు (5) గుంటూ

రుసీమను అవధానసభయందుఁ జదువకుండ వారింపమని యీప్రసంగ మును వినుచున్న కొందఱుకోర, "తిరుపతివేంకటకవులు నిందించిన వే మును మఱియొకనాఁడు నిందించలేమా?" యని యాకోరికతోఁ దమ కవసరములేదనియుఁ గొప్పరపువారు సోమయాజులగారితోఁ జెప్పినట్లు నుమఱియు (6) గుంటూరుసీమయనుగ్రంథము పైనిఁజెప్పఁబడిన వివాద సభయగువఱకుఁ బ్రచురింపవలదని తిరుపతివెంకటకవులకుఁజెప్పి వారిం తునని సోమయాజులగారు కొప్పరపువారితో వాగ్దానమొనర్చినట్లును తెలియవచ్చుచున్నది. సోమయాజులుగారు వేమవరపుసభయందొొన ర్చిన యుపన్యాసవిషయము లెంతవఱకుభిన్నములో ఆభేదమువలనఁ దదుపన్యాసము సరసమైనదో అట్టిభేదమే లేకున్న నాయుపన్యాసము విరసమగునో కాదో మతిమంతు లూహింతురుగాక. ఊరక తిరుపతి వెంకటకవుల కాగ్రహముకలిగించు కొప్పరపువారివాక్యములను విడిచి కావలయు ముఖ్యాంశములనుమాత్ర ముపన్యసించుట సత్యమునకు విరుద్ధమనుకొనందగదు. కొప్పరపువారు తమకును తిరుపతివెంకటకవు లకును విరోధములేదని యన్నారని సోమయాజులగారు చెప్పుటసంభ వించియేయుండిన నాయన యుపన్యాసమందలి వివాదసభప్రసక్తికిఁ గారణమెట్లుకలుగును? వారుచెప్పినమాటలలోశివరామశాస్త్రిజయాప జయప్రసంగము రానేలేదు. ఇందునకు ధూళిపాళ నరసింహముగారే సాక్షులుగానుండనగును. కనుక సోమయాజులగారియం దెట్టిదోషము కలదో విస్పష్టముకాకున్నది.

ఇప్పుడు కొప్పరపువారు మాకు (నాకును మల్లాది సోమయా జులగారికిని) సభయందుఁ జదువుటకై లేఖలంపినవార్త యెట్టిదో కను గొందము. వేమవరమందు 28 డిసెంబరురాత్రి జరిగినవృత్తాంతము

# ఇందుమతీపరిణయము

## చతుర్థాశ్వాసము.





క॥ శ్రీరాజరాజశేఖర, తారాగహారహీర తారాచలరా
ట్ఫారదధారాధరచయ, నారదసత్కీర్తిసాంద్రవరసనరేంద్రా॥ 1

గీ॥ అవధరింపుము శౌనకాద్యఖిలమునులు, కనుపమస్వాంతుఁ డగుసూతుఁ డనియె నిట్లు
శరదృశునితాంతవిధముల జయులకెల్ల, చిత్తరంజన మొనరించి చెలఁగ నంత॥ 2

ఉ॥ ఆశివశర్మభర్మమణి హర్మ్యనికేతనకేతనాంశురే
ఖాశమితాభ్రభగున్యుదిత కంబుదళద్యుతిపూరమా పద
ర్భశుపురంబు జేరి మనుజేంద్రసహోదరుమ్రోల నిల్చెఁగ
న్యాశతముల్ దనుంగని రయంబెసగ న్వినుతుల్ ఘటింపగన్॥ 3

క॥ చపలాక్షు లుంచునవర, త్నపురోళుకులు గాల్కుసుందనపుగద్దియపై
నృపనందనయిందుమతి నుండి, పురోహితుఁ డప్డు మిగుల డెందం బలరన్॥ 4

క॥ తనరాకను మది వేడ్కన్, దనరఁగఁ గలకంఠి వందన మొనర్చుచు స
ద్వినయమున నలర విప్రుం, డనియెన్ దీవించి మిగుల హర్షం బెసఁగన్॥ 5

శా॥ నీకోర్కుల్ ఫలియించె నమ్మ తరుణీ నీపంపునం గాంచితిన్
సాకేతంబు మహాద్భుతప్రదమణీ సౌవర్ణవర్ణస్ఫుర
త్ప్రాకారాంచిత గోపురప్రకరవిభ్రాజన్మహాకేతన
శ్రీకాంతం బగుతత్పురీవరము వర్ణింపన్ విచిత్రం బగున్॥ 6

సీ॥ ఏచాయఁ గనుఁగొన్న హీరముక్తామణీ, వైడూర్యనీలప్రవాళతతులు
ఏచక్కిఁ జూచిన శ్రీచందనాగరు, ఘనసారఘనసార గంధకలన
యేదారి వీక్షింప మృగనాభికాసంకు, మదపంకనవకుంకుమవ్రజంబు
ఏ[illegible]క దర్శింప హేరాళిబహువిచి, త్రాంశుకస్వర్ణపట్టాంబరములు॥

గీ॥ దంబ మలరంగ గెల్చు నిజంబు గాఁగ, నగరిపుపురంపుకోట నన్నగరికోట
ముంగట జెలంగు నంగళ్ల రంగమీఱు, జారుతరమైన పెద్దబాజారుసారు॥ 7

గీ॥ అమితకళ్యాణమణితోరణాభిరామ, మతులహృద్యానవద్యవాద్యస్వనంబు
ధరణిసురవేదశాస్త్రబంధురరవంబు, తత్పరీవారమత్యద్భుతప్రదంబు॥ 8

ఉ॥ నీడలు దేఱుశక్రమణి నిర్మితలీల వెలుంగుమేడలున్
వాడలవాడలన్ బసపువన్నెలు చల్లుకడానిగోడలున్
వేడుక లిచ్చు మెచ్చుగల వెన్నెలడాల్ నెలరాలజాడలున్
జూడనుజూడ నప్పురము చొప్పడు నప్రతిమానసంపదన్॥ 9

అందు 10

సీ॥ కురువిందకందళీ స్ఫురితకుట్టిమభూమి, కలనంబు లీగృహాంగణములందు
వరపుష్యరాగబంధురనూత్నకలశాంక, సౌధయూథంబు లీచాయలందు
వనజాతరూపభాస్వత్కవాటద్వార, వలభిజాలంబు లీవంకలందు
పురుహూతనీలవిస్ఫురితనవ్యస్తంభ, ఘననికాయంబు లీకడలయందు

గీ॥ ధూపసౌరభనవపుష్పతోరణాది, మంగళాచరణాదిక మహిమలందు
నెందుఁ గన విందులను జిందునిందిరాప్తి, సుందరం బైనరఘుసూను మందిరంబు 11

క॥ ఆమందిరంబులోనన్, ప్రేమం దిరమైనలీల బిసరుహవదనల్
చామరము లిడఁగఁ గొల్వై, వేమఱు ముద మొందుభూమివిభుసుతుఁ గంటిన్ 12

క॥ కనుఁగొనినయంత నెంతయు, వినయం బెనయంగ నతఁడు వేడుక మ్రొక్కన్
మన ములరఁగ దీవించితి, ననఘుఁ డోం డొసఁగె మాకు నర్ఘ్యాదికముల్ 13

గీ॥ ఒసఁగి కుశల మడిగి రసికుఁ డయ్యాజుఁడు భ, వన్మనోజ్ఞరూప వర్ణనంబు
వినఁ దలంప నేను వినుతిఁ జేసితిఁ దావ, కీనవివిధసుగుణ ఖేలనంబు॥ 14

ఉ॥ చింతిల నేమి? కాంత! నృపశేఖరుఁ డారఘునందనుం డజాం
డెంతయు నేను దెల్ప దనుయుచ్చఁ ద్వదాకృతి యెంచి యెంచి యిం
తంతనరానికూర్మి జలజాస్త్రశరాళి విరాళి మీఱఁగా
సంతతమోహమగ్నుఁ డయి సారెకు నిన్నె తలంచు నాత్మలోన్॥ 15

సీ॥ వానిసౌందర్యంబు వర్ణింప శక్యమే, మఘునకునైనమన్మథునకైన
వానిమేధాశక్తి వచియింప వశమె వాక్పతికైనను బృహస్పతికినైన

వానిచల్లదనంబు వహిం దెల్పఁ గొలఁదియే, విధునకునైన నవ్విధునకైన
వానితేజస్స్ఫూర్తి పూని మెచ్చఁ దరంబె, హరునకైనను దమోహరునకైన।
గీ॥ వానిసౌశీల్యగతి నుడువంగ నౌనె, కవులకైనను మానిపుంగవులకైన।
ఇందుమతి! యేమనంగ వచ్చు నెంచిచూడ, నెందు మతిమంతులతనితో నీడురారు॥ 16

ఉ॥ చామనిచాయ మేను గలచక్కనివాఁడు వెడందనొసలా
తామరతూపులం గెలువఁ దార్కొనుకన్నులవాఁడు కల్వరా
మోము మెఱుంగువాఁడు జిగిముద్దులనవ్వులవాఁడు కాంతలన్
బ్రేమఁ గరంచి మించి వలపించునొయారమువాఁడు భామినీ॥ 17

గీ॥ వాణి యీ రాజనందను వదనమున బు, ధాగ్రణిగ నెంచివివిధవిద్యానిరూఢి
నెప్పుడు నటియించుఁ గానిచో నెంచిచూడ, నజుఁడనెడి పేరుదాల్చునేయతఁడు తరుణి
గీ॥ అదె యతండజుఁ డౌటనే హరినిరూఢి। మధ్యమునఁ గల్గువాఁడమ్మ మఱియు నతఁడు
సంతతశివస్వభావుఁ డో కాంత? నీవు। వాగ్రమాశర్వమంగళోజ్వలత గనవె 20

ఉ॥ ఆజలదంబు శైలతతులందుఁ జరింప ద్విరేఫపంక్తు లా
భూజములందుఁ ద్రిమ్మరఁగఁ బూవులతావులకెల్ల దీవులై
నైజపునీలలీల సురనాథమణి న్విదళించి సొగసై
రాజకుమారు పెన్నెఱులు రాజిలు రాజమరాళగామినీ 21

సీ॥ నలనలగల్వలగెలువఁ గలమేను, దనరువాఁ డొయ్యారమొనరువాఁడు
గంబురాడంబు రాణింబు రాణించు కే, మోమ్రవివాఁ డెనలేనిరీవిఁ వాఁడు
వగరాలనిగరాలజిగిముద్దుపల్కుల, ద్దళుకువాఁ డెలనవ్వు చిలుకవాఁడు
నెఱిమించుసిరి గాంచుసరిగచుసన్నంపు, చేలవాఁడు సుమాస్త్రలీలవాఁడు
గీ॥ వలనుమీఱుపదాఱేండ్లవయసువాఁడ। సుదతులమనంబు గరఁగించుసొబగువాఁడు
బలిమిఁ దగువాఁడు ధననాథుకలిమివాఁడు। రాజకులరత్న మారాజు రాజవదన 22

క॥ ఆయజునిచక్కదన మిఁక। నాయజుఁడు యెఱుఁగుఁ గాని యవనీస్థలిలో
నేయజనీయు లెఱుంగరు। కాయజుఁడైనను నుతింపఁగా సరి యగునే 23

శా॥ ఆలావణ్య మగణ్య మావినయ మత్యైశ్వర్యసంధాయకం
బాలీలావిభవం బనన్యసదృశం బాధైర్య మాద్వంద్వ మో

బాలా! యానగనాథనందనుఁడు భూపాలాత్మజశ్రేణిలో
మేలౌవాఁడు మహోన్నతుం డతఁడే సుమీ యమ్మ! యాత్మలో నెంచఁగన్ 24

క॥ నీకా రాకొమరుఁడు దగు, రాకొమరున కీవు దగుదు రాజీవముఖీ
లోకాలోకాంతరజన, లోకంబున మీసమానులుం గలరె చెలీ॥ 25

చ॥ తరుణి! విదర్భరాజ ప్రముదంబున రేపిదిగో భవత్స్వయం
వరవిభవంబు చాటఁ బనుప న్రఘునందనుఁ డేగుదెర మీ
యురుపురమున్ వివాహ మగు నెంతయు నమ్ము మటన్న వేడ్క నా
సరసిజగంధి చాల శివశర్మను సత్కృతి జేసె నంతటన్ 26

క॥ ఘనతరకౌతుకమతి యై, చెనరున నృపపుత్రి పనుప నిజగృహమునకున్
జనె నవ్విప్రుం డంతట, వనజహితుం డరిగె నపరవారిధికడకున్ 27

మ॥ తరుణాశాతరుణీవతంసము కరద్వంద్వప్రహారస్ఫుర
ద్గరిమన్ వేడుకతోడ నాడఁగ రయోద్ధత్యంబునన్ జాతి య
చ్ఛగమాబ్ధిం బడినట్టి కాంచనమణీచంచన్మహాకందుకం
బురహిన్ సూర్యుఁడు గ్రుంకెఁ గోకములగుంపుల్ తల్లడం బందఁగన్ 28

సీ॥ అఖిలదిగంతనీడాగామివిహగంబు, శైత్యభాగినకాంతసముదయంబు
ఆశాంతమృగతృష్ణికాంబుప్రవాహంబు, గృహగామిథైనుకాకీర్ణపథము
ధగధగజ్యోతిర్లతాస్ఫురన్నగభూమి, భవనవిన్యస్తదీపవ్రజంబు
విక్షిప్తజలకణావిష్కృతాంగణరాజి, యుజ్జ్వలోలూకవిహారకేళి
గీ॥ సాంధ్యకరణీయవశజలాశయతటాక, ధావదవనీసురగణంబు ద్రవదమంద
చంద్రకాంతచయంబును జారచోర, సాంద్రసంతోషకర మయ్యె సాంధ్యవేళ॥ 29

ఉ॥ ఇందనఘ న్నిశాసతికి నెంతయు శోభనవేళ యంచుఁ దా
నందము మీఱ బశ్చిమదిశాంగన మేన నలంకరించెనో
కుందనపున్ మెఱుంగుజిగి గుల్కెడు క్రొత్తరువారపుంజ గా
చందురగావిచీర యనసంజ వెలింగె మహారుణప్రభన్ 30

సీ॥ కన్నె గేదఁగిగుంపు గనుపించుచందానఁ, బవడంపుఁదీగెలు ప్రబలురీతి
తలిరాకుగుములు దుళకించువైఖరిఁ, గెంపురాజిగి సొంపు గెరలుదారి

దాసనంబులకాంతి దార్కొ-న్న యందాఁక, జంద్రంపుసోనల చాయకరణి
చెంగల్వవిరిడాలు చికిలిమించినమాడ్కి-, గ్రొమ్మించిమించులుగ్రమ్మవగను॥

గీ॥ ధాతురేణుకదంబసాంద్రతరబంధు, జీవశోభామహాస్ఫైచిత్రి వెలయఁ
గలయఁ బశ్చిమదిశయందుఁ గాననయ్యె, సరగ సంధ్యారుణప్రభ జనులకెల్ల॥ 31

సీ॥ కులటావినీలావకుంఠనప్రకరమో, శాంకనాకస్తూరికానులేప
మభ్రేందిరానూత్నాంజనంబొ కులాలి, లాక్షీగవిబిధవన్యాకదంబ
తాపింఛపటలి ధాత్రీపయోజాననా, లంకృతనీలోత్పలవ్రజంబు
కాలరంజితఘనాఘనరేఖ విరహాంగ, నాలింగితమదనప్రతాప॥

గీ॥ దవదహనధూమజైత్రయాత్రావిచిత్ర, చిత్రభవకృత్యధృతనైలజిన్మణీవి
నీలనూతనకంచుక నికరమనఁగ గాఢతిమిరంబు జగములఁగ్రందుకొనియె॥ 32

గీ॥ తనకు నగ్రజుఁడైన చంద్రునిశుభోదయాధికతఁ జూచువేడ్క నప్పుడు గగన
లక్ష్మి మగరాలదండల నలంకరించెఁదనము నెమ్మేననఁ దారతతులు దనరె॥ 33

మ॥ తనమిత్రత్వము లోకబాంధవత యందం దానె తాఁపొందెఁ జెం
ద నొనర్చెన్ భువనాళి మత్కువలయానందంబు తాఁ జేయ నే
రనివాఁడే యినుఁడంచు దానతని చక్రంబుల్ గలంగించఁ దా
ల్చెనొ రోషం బన నెఱ్ఱఁబాఱె శశి దోఁచెన్ బూర్వాద్రిఁ బ్రాగ్దిక్కునన్॥ 34

క॥ సురనగేంద్రజాలికుఁడు పూర్వమహీధ్రప్రకటమున నవంగ నెగరం
గ నరుద్వీథి నెవ్వేచిన సుమనఃకందుక మనంగ సోముఁడు దనరెన్॥ 35

సీ॥ కువలయం బరయంగ శివుఁడు చంద్రాకృతిఁ జవలరాఁ దోఁచు స్థితచ్ఛాయయనఁగ
సుతుమహాభ్యుదయంబుఁ జూచి యుప్పొంగిన కలశాబ్ధి కల్లోలకాంతియనఁగ
కినిసి మన్మథుఁ డేపుల గెల్చినకనలాప్తుకన్నీయకీర్తి ప్రకాశమనఁగ
విరహాళిపై దాడివెడలు పద్మభవు తెలిగుడారంబుల చెలువనంగ

గీ॥ కాశమౌక్తికఘనసార-గంధసారకుందమందారధవళారవిందబృంద
శంఖకైతకనవహీరసదృశచంద్రికావికాసంబు జగమెల్లఁ గ్రందుకొనియె॥ 36

వ॥ వెండియుం నఖండపుండరీకభవాండభాండహర్మ్యసుధావిలేపంబు లగు
చు సుధాశతరంగిణీతరంగసంఘంబులకు వినూత్నడిండీరఖండంబు లగుచు వియోగి

నీచక్రంబుల సంతాపవల్లికల కతిస్వచ్ఛనీహారపూరంబు లగుచు జకోరంబులకు సుధాసా రంబులగుచుఁ బురాహిత శిరాసనప్రముఖ ధరాధరంబులు ప్రాలేయరాజితాచలంబు లడంబు విడంబింపఁ గెందలిరుటాకుల మిటారంబులు గలమహీరుహంబులన్నియు బృం దారక తరుబృందంబుల చందంబు నొంద నందందుఁ గ్రందుకొను మల్లికావల్లికామతల్లి కలల్లిబెల్లిగ నల్లుకొనిన శృంగారవనంబులకు నేడాకుటనంటికపురంపు దుమారమ్ముల దువారమ్ము మీఱుచు నవలీల లవలీవనీ కుంజపుంజంబులం దూరుచుఁ దిశాంగనా నితంబ బింబాలంకరణానుకూల దుకూలంబులగుచుఁ ధరానితంబినీ ధవళాంశుకవితానంబులై హిమాంశుతారాపరిణయోత్సవసమయంబున గగనేందిర యలందిన చందనంబన సంధ్యా నటన చటులతర ధూర్జటిజటాచ్ఛటాచలాచలత్పతజ్జహ్నుజాఝురంబు దిగజాతిజగమ్ము లం గ్రమ్ముకొను నందంబున వెలుంగుచు నుపవనవిహారద్విరహాంగనా జనంబులమీఁద మందానిలాందోళిత శాఖిశాఖాచలద్దళాంతరమ్ములజాడల నాడాడం బొడసూపు నివ్వాల వ్వాల వెడల వెదవిత్తుందవదవిం బుప్పుసూపుని బెగడిపడిలిగుడ వజ్రంపుకడెంబులడం బుగలకరంబులమునుంగు లిడుపైరాశిచెలువ దువ్వాలువచెఱంగు మెఱుంగులతోడ సింగా రంబు లెసంగు తదీయసీమంత మౌక్తికాభరణ కిరణస్ఫురణ కబరీనిబిరీ సవినూత్న సేవం తికాలతాంత కంతుకనితాంత కాంతిసంతతులతోఁ బంతంబులాడుచుఁ వేడుకలం బొ దరిండ్లకడల నడయాడుమం గడలిరాముద్దుకొడుకు మేనల్లుని దుడుకు నడకల మిడుకి లకు నెగులు పడి మగలవెంబడిం బడి ప్రతిపదంబును మదనుపద నెఱింగి తత్పదానుస్మ రణం బొనర్పుచు సతినిపదంబులు ముదంబులు ముదంబు వెలయఁగ లయ దప్పకుండ వీఁకఁ దిరిరి కిన్నరులు కిన్నరలరీతి బొటులక్రొవ్వాడి గోటికొనల మీటిననీటెనయం దీయుచు నపరిమితరీతులం బాడుచుం జరించు విరహోత్కంఠికల ప్రియాదరణసమయ సంజనిత మందహాస విలాసంబులతో మార్మలయుచు నచ్చటచ్చట నెలరాలగచ్చునెల వుల నిచ్చలు ముచ్చటలఁ దచ్చనల విచ్చలవిడి నిచ్చలపు పచ్చికల హెచ్చుచుఁ దమ్మ మెచ్చక పల్కుపలుకులకు నలుక గదిరి బెదరించుప్రియుల నెదురించం బోయి తదీయ లీలాకృత స్వకీయ కపోల చపేటంబులకుం జప్పించుకొను పైపునఁ దిరుగు తిర్యగ్వ్యాళి తకంధరులగు మెఱుంగుబోండ్ల ముత్తెలకమ్మల చకచకద్యుతులఁ జికిలి సేయుచు ని శాకరస్యంద మానేందుకాంతావారి ధారాపూరితంబు లగుసరోవరంబులంగల కుముదం బులకుఁ బరిమదంబొనర్చుచు నంధతమసావృత లోకంబులకు గురుచంద్రకర స్పర్శ యోగంబు గలుగుటం జేసి మనశ్శీతలత్వకారణం బగు తదీయ స్వచ్ఛతావిభవంబు వివి

ధవస్తు నామరూపభేదంబు లేమియుం దోపనీయక జగదండ మండలోర్ధ్వాధర దృ
గ్బాహ్యాభ్యంతరంబుల నిండి వెల్లివిరిసిన చందంబున నుండు నప్పుండువెన్నెలకాఁక
సోఁకనకుం గాక యిందుమతి హా యనుచు హాయిలేక కోకిల కాకలీరవకేకికా రవంబు
లం గల రవకుల రవంబుల మనోభవు సుమనోబాణంబులం బ్రాణంబులు తల్లడిల్ల డిల్ల
చెడి మొల్లవిరులపాన్పునం బొరలి పొరలి చం గావిచీర చెఱంగు మెఱుంగు మొగంబునకు
మఱుంగు గావించుకొని యనంగుని మూఁకం గనుంగొన నోడి చేడియ లొనర్చు శైత్య
కృత్యంబు నాదరింపక యర్గలంబైన తపంబునం గన్నీరు దొలఁగ నూరకున్నం గనుంగొ
ని మందమందవచనంబుల నుపచరింప నయ్యిందుముఖికి డెందంబలర సునంద చందమామం
గని యిట్లనియె॥ 37

చ॥ కలువల నేలుచూపులు రకంబగు మాచెలిమోము ముంగలన్
నిలువఁగ లేక వెల్లనయి నిల్చినచోటుల నిల్వఁ గూడకే
కళలవిహీనతం గళలఁ గాదె చరింతు సదా కళంకివై
జలరుహవైరి? నేఁడిఁకలు సాటికి నల్లుని గూడి వచ్చితో॥ 38

చ॥ వననిధి నుద్భవించి తను వార్తయు నిందుము శౌరి నెమ్మనం
బున నదియుంచి తఁగ్ర మునిపుంగవుకంటను బుట్టె నంద్రుఁడు ని
న్ననువగుచోట్ల నీజనన మయ్యెను సద్గుణవర్తనంబు ని
న్నెనయదు చంద్ర పద్మముల నేచెద వేటికి మాటిమాటికిన్॥ 39

సీ। కువలయాధీశుఁడై రవణ జెందుటె గాని చక్రాభిరక్షణోత్సవము లేదు
ద్విజరాజ సంజ్ఞచే వెలయుమాత్రమె కాని సత్తేజమలరించు సరణి లేదు
సోమాఖ్య మిన్నందిచూపట్టుటయే గాని మరుని గర్వమణంచు మహిమ లేదు
శరభిమగ్వరరీతి జరగుమాత్రమె కాని నిజపాండుశోభ మానినది లేదు

గీ॥ యుక్తి దెలియంగ యౌదార్య మొకటఁ గాన। మేమనఁగ నీప్రసిద్ధియు నామధేయ
నియతి దలపోయ నారార నేటిబిఱ। కాయు చందంబులాయెఁ జెంగల్వరాయ॥ 40

క॥ నీవంటి కొడుకు పుట్టుట। యీవారధికడుపునుంట యంటుట గాదే।
యేవేళఁ గలఁగి మిగుల వి। రావం బొనరించుటెట్లు రాజీవారీ॥ 41

గీ॥ బాడబము హాలహాలము నీతోడఁగూడఁ। బడసె నోచంద్ర? యెన్నఁడు నడలలేదు
కడలి వాటికిఁ గా,నిన్నుఁ గన్నకతన। జడధి యయ్యెను భంగముల్ చాలఁగాంచి॥

గీ॥ కవు లెటులు నిన్ను వర్ణించఁ గడఁగిరొక్కొ।
రహిఁ గళల్ గుల్కుచక్కని రాజ వనుచు।
వంక జనియించె నీవంక శంక లేదొ।
వంక లేక నైన మాన లేవా? శశాంక॥ 43

సీ॥ ఉత్పలప్రియరీతి నొందుని కర్థంబె, దలఁప నిశాచరత్వప్రసక్తి
అఖిలసద్గుణతేజ మణఁచి యెంచుట యవ, శ్యంబును నీవు దోషాకరుఁడవె
పద్మినీసంతాపపరుఁడ వౌదొకపక్ష, మున నీకు గురుతల్పగామి వనుట
పరగఁబరాంగనాసక్తిఁ జెందెడి నిన్ను, శంకయే యెపుడు కళంకి వనుట

గీ॥ యెట్లు ద్విజరాజ వైతివొ యెంచి చూడ।కటకటా? రాహువు గ్రసించఁ గళలు దఱిగి
మున్ను దక్షాధ్వరంబునఁ బుడమిఁ బడియు।బ్రతికి తే? చంద్ర? పాంథపాపంబుకతన

క॥ పరమేశ్వరునంతటిఘను।శిరమునఁ బాదంబు వెట్టఁ జెల్లఁగ డెసిగఁ
విరహిణులఁ గలఁచు మర్మతి।యరుదే? సన్మార్గవర్తి వౌనాను శశీ 45

గీ॥ అన్న యిందిర కెన్నంగ నవ్వెలంది।యాదరించిరతమ్ములు నలఁచె దీవు
విరహిణీజనహృదయారవిందవితతి। నేచు టది యెంత పనినీకు హిమమయూఖ 46

గీ॥ ఔర? వృశ్చిక రాశి యందడుగుఁ బెట్టి।యలరుదీవును విషమూర్తి వగుదు వేమొ
కాక యుండినశివుఁ డరకాలఁ దన్నఁ।జెలఁగి వేవేగఁ దల కెక్కి నిలువఁ గలవె 47

మ॥ అనుచుం జందురు నింద చేసి నృపకన్యాళీవతంసంబు క్రొ
న్ననవిల్కాని మెఱుంగుతూపుల గమిన్ దాపంబునం జెంపుచుం
దనగంధిం గని చింతతో నతనిభార్త్యం బెన్నుచుం దూలిప
ల్కె నవీనాబ్జమరందసారములజాల్ చెందన్ మనుంబల్కులన్ 48

సీ॥ ఒనర సంజీవని యొసఁగెనో? యౌషధీ, శ్వరుఁడౌటమీమామ చందమామ
సృష్టికర్త నటంచుఁ జెలఁగి నిన్ సృజియించి, విడిచెనో? మీయన్న వేల్పుమిన్న
మాయచే నిన్నుఁ గ్రమ్మర నుండఁ జేసెనో?, నలువొందుమీయయ్య నల్లనయ్య
వినుతపతివ్రతానునత మీఱఁగ నిన్ను నేడెఁ బ్రోచె? తనరీవి నీదు దేవి

గీ॥ యెవ్విధంబైన నేమి నీ విపుడు తిరుగ।బ్రతికివచ్చితివౌరా? ప్రతిభమీఱఁ
గుంటికడయుంటివౌరతోడఁ గంటిఁ దొడరి।తుంటవిలుతుండ? నీవంటిబంటు గలఁడె

ఉ॥ ఏనసమాంబకుండ వని యెంచియొ శంకరు గెల్వఁ జూచితౌ
నౌను భవద్వివేక మసమాంబకుఁ డంచు నెఱుంగ నైతె యీ
శానుని నీదువిల్లుతుద చప్పనయ్యె శకలంబులొఁ గదా
సూనము నీశరం బెటులఁ జొప్పడు నీకు జయంబు భావజా 50

క॥ చ్యుతసారశరుఁడ వీవ।చ్యుతసారశరుండు శివుఁడు చొప్పడు నే నీ
శతనిం గెల్వ బలాబల।గతి యెఱుఁగనినీకు జయము గలదొకో మదనా 51

ఉ॥ మ న్మద మొప్పఁ గేళివని ముచ్చట నచ్చట నిన్నుఁ బూజ సే
య న్మదిఁ గోరికట్టిఫల మంతయుఁ దోడనె గల్గెఁ గాఁకచే
త న్మతి యేచెదింతిని కృతఘ్నుఁడ వౌర! తలంచి చూచినన్
మన్మథ! యెవ్వరైనను నమన్మథన క్రియఁ జేయఁ జాతురే॥ 52

శా॥ నీబాణంబులు రాల నీధనువుఖండీభూతమై పోవ నీ
జాబిల్లిన్ ఫణి యంట నీబలము లాశావీధిపాలై చనన్
నీబంట్రౌతుతనంబు స్త్రీలయెడ నే నిన్నెవ్వరున్ నవ్వరే
మాబాలామణి నేచఁ బోకు మకటా మర్యాద గా దాత్మజా॥ 53

వ॥ అని యాసునంద యీసునం దనచమత్కృతి యలర నలరువిలుకానిం బలికి కురంగట మెఱుంగుపువొ్పడు లుప్పరం బెగయు నుప్పతిలులీల నెసంగువరంగతురంగు ని గనుంగొని యిట్లనియె॥ 54

గీ॥ భూతమై నీవు సోకెదు భూతలమున, పాంథతతిమీఁద నాకులపాటు దోపఁ
నైన వెఱతుమె యచలసామర్థ్యాలసద, హీనవరమంత్రగరిమ నిన్ని పుడె యణఁతు 55

క॥ పవనా! చెలిఁ బ్రోవఁగ నో, పవనా! యిది యేమి ప్రాణపదమై మెఁబెం
పవ నాతికిఁ గడుమేల్ చూ, పవనాద్భుతి గాదయో ధుతాంచదుపవనా॥ 56

ఉ॥ చెల్లదె వేఁడివెన్నెలను జిచ్చున కోర్వఁగ లేక యెంతయున్
దల్లడ మందె నిందుమతి దానిపయిన్ పదలింపఁ జెల్లదె
చెల్లఁగ «గోరుచుట్టుపయి రోఁకటిపోటు» నైవడిన్
దొల్లమి గాఁగ గంధవహా! ద్రిమ్మరి పౌట యెఱుంగరే జనుల్॥ 57

సీ॥ పద్మగంధి యటంచుఁ బదరకు మధుపంబ!, చాంపేయనాస యీచారుహాస
పల్లవాధర యంచు బదరఁబోకు పికంబ!, వర్షాబ్దవేణి యీపావనజపాణి

జ్యోత్స్నాతుణ యటంచుఁ జొచ్చి రావు చకోరగ?, నిటలేక్షభూష యీచటులభావ
తారేశముఖ యంచుఁ జేర కోహరిణంబ?, హరిమధ్యలీల యీయధిపబాల
గీ॥ భ్రమరకస్వరనేత్రదృగ్బాధవముల, హితుల రటు గాన తెల్పితి మింతెమీరు
కూర్మి వినరేని తిరుగుట కూఁత లిడుట, స్పృక్కియుండుటయుడుగుటనుమ్మఫలము॥
సీ॥ ఓచెల్ల? యింక నైన నీచల్లదన ముంచు, మాచెల్వపైఁ జందమామ? నీవు
నీయందుఁ క డు భక్తినెఱయంగ వర్తించు, మాయిందుమతిఁ బ్రోవుమదన? నీవు
యీసూనఁగా నేల యీసూనగంధంబు, హసాసానఁజెలిఁ గావు మనిలఁ? నీవు
నీవాఁడి చాలించి మావాడ నలివేణి, చేదోడు గా నుండు చిలుక? నీవు
గీ॥ వాకలతనంబు మాని నిర్వ్యాకులగతి।కోకిలా? యేకడల నీదు కాకలీవి
రావ మలరంగ నీభోజరాజసహజ।వినయ మెనయంగ గొల్వుమీ వేడు కలర 59
వ॥ అని యివ్విధబునం సుధాధోరణీధురీణవాగ్ధారాపరాజితమరంద యగుసునంద
యిందుకందర్పమంచానిలకోకిలాదినిందనం బొనరించి యిందుమతిం గనుంగొని యిట్లనియె
చ॥ వెఱవకు మమ్మ కొమ్మ? వెడవిల్తుని జందురు దక్షిణానిలుఁ
వరుసగ వీడ నాడితి మెవారలు తాప మొనర్ప లేరు నీ
తెరువిఁక రారు భూవరుఁ డతిప్రమదంబునఁ జాటఁగా స్వయం
వరవిభవం బగుఁ రఘునృపాలకుమారుఁడు వచ్చు నచ్చుగఁ 61
గీ॥ వచ్చినంతనె కల్యాణవైభవంబు।గల్గుసౌఖ్యాబ్ధి సోలాడఁ గలుగు నీకు
తడవు లే దింత చింతిల్లఁ దగదుసుమ్మి।తాల్మి వదలంగఁబోకుమీ? తలిరుఁబోఁడి 62
గీ॥ నెమ్మ్రమై యుండు నెమలి పన్నీరు దలపఁ।నమృతమై యుండు మానసం బలరఁజేయు
నంచ ప్రాణపదం బగు ననిలుఁడెంచ।వెఱవఁగా నేమి యీవేళ వెత్తిబాల 63
క॥ ఈమురనికాఁక యాలఁ।వేమఱు శైత్యోపచారవిధ మొనరుటకై
యేమఱక యున్నవారము।భామరో? నీకోర్కె వేగ ఫలియించుఁజామీ 64
మ॥ అని యాచందమునఁ సునంద యన నా నా నాను శీఘ్రంబె మే
ల్గనె దోచిల్కలకొల్కి? యంచు దెలియంగా వేగ నొక్కమ్మడిఁ
జని తౌత్కంఠ్యమునఁ దదుక్తగతి నుచ్చైస్సూక్తిఁ దా ము న్వచిం
చెనో కాలజ్ఞములాట నా ధ్వనుల మించెఁ దామ్రచూడౌఘముల్ 65
సీ॥ ప్రాభాతమారుతప్రవికంపితసురద్రు, గళితసూన స్తబకం బనంగ
మానసాంచత్రావ క్షుమాధరతటనట, త్పటుతరహంసశాబం బనంగ

నస్తాద్రిధావత్సుధాంశుపశ్చాద్భృత్య, కరవిస్ఫురితరూపకలశ మనఁగ
రవిసమాగమనసంరంభవేళాసతీ, కరదత్తఘనమౌక్తికం బనంగ

గీ॥ విలసితోదయనగఝరీసలిలధౌత। వాసవదిశాంగనాముఖవనజలలిత
కలితఘనసారనవతిలకం బనంగ। జొక్కమై యంతటను వేగుఁజుక్క వొడిచె 66

క॥ పుడమిఁ గలద్విజులునయ్యె। మొడ నదులం గ్రుంకఁ జూచి యే ద్విజరాజున్
దొడిఁ బడ నధికతకై య।క్కడలిం గ్రుంకెద నటన్నగతి శశి గ్రుంకెన్ 67

గీ॥ శశికళాస్ఫూర్తి సుస్నేహవశతఁ జాల। నలరి యుంటిమి యిందుపమాహరణవి
ధిం బొనర్పం గృహస్థధర్మంబె యని మ।దిని దలంచియొ దీపికల్ తేజ మెడలె 68

వ॥ మఱియు మాగధమధురగీతస్వనంబుల మేల్కొని రయంబునఁ బ్రణయ కలహంబులు మాని మానినులం గలయం గడంగు లీలాజితరతిరాజులగు రాజులును, రాజనియమితులగు యామికుల కగపడనివడుపున భూమికలు దాల్చి సమీపభూమింగల స్త్రీవల నివ్వల నవ్వల నిజస్థానంబులకుం జన నుపాయంబు లెంచు పల్లవీ వితానంబును తానమానంబుల ననూనంబులగు గానంబుల జాణలగు గాణల శిక్షణంబునం బ్రతిక్షణంబు నవిరళగతి నరసి పాడుచుం జెలంగు వారబాలికామణులును, మణిఖచిత గృహాంగణంబులం గలవేదికలం గూర్చుండి మోదకలన వైదికులను దొలుబలుకుల పాఠంబులకొఱకు నొకళ్లొకళ్లం బిలుచు విప్రకుమారుల కోలాహల బహుళంబులగు గృహంబులును, గృహాలాంఛన గృహోచిత వ్యాపారంబులకునై రయంబునం జన నిచ్చియు, బునః పునారతులకై పెనంగు ప్రియుల మనోరథంబులు సఫలంబొనర్ప నేర్పరులై తమకంబుమీఱ గమకంబుగా ఘటియించు పరిరంభణంబులం బ్రీతులం జేసి కౌఁగిళులకుం జిక్కి ప్రేమంబునం దడయుచు మనంబులందోఁచు శిక్షావిచక్షణ చతురవచనాది భయంబునకై యుపరిసురతం బొనర్ప బెళుకు మెళుకువం దప్పించుకొని యొక్కొక్క నెపంబునం బతులం గికురించి సత్వరంబునఁ జను సతుల విస్రస్తంబులగు కబరీభరంబుల నుండి వ్రాలిన విరుల నెరసి భరంజెందు మరందబిందువులం గ్రోలి వ్రాలిన గంధాంధ షట్పదచయంబుల నాకర్షించు సుగంధబంధురంబులగు సరోరుహ బంధూకయ సమయ దదళనవీన కోరకంబులరకంబులకుఁ దటాకంబులకు నిమజ్జనార్థంబరుగు ధరామరవరుల హరికీర్తనధ్వనులు వెలయు నంతట నహర్ముఖం బగుటయు ననంతరంబ॥ 69

మ॥ జలధిన్ మజ్జన మాడి సాంధ్యరుచి పుష్పంబుల్ సమర్పించి వా
ర్ధిలలస్ఫారితరంగవాద్యరవ మెంతే వింతచందంబుగా
నలవేళాసతి ప్రాగ్గిరీశ్వరునకున్ హస్తంబుతో నెత్తు బిం
దళుకున్ మేలినివాళికుంభ మన మార్తాండుండు దోఁచెన్ దివిన్॥ 70

సీ॥ చెంగల్వపగవాఁడు చెంగల్వ చెలికాఁడు కటికి చీఁకటిదిండి కరమువాఁడు
బలునేఁడుములతావు ప్రామినుకలతావు వెన్నునంఘ్రికడాని వెన్నుపూవు

జక్కవకవపంట చుక్కరాయనిజంట పదిరెండు తనువులఁ బరఁగుదంట
భవరోగములమందు పటుతేజములపొందు చాయనెచ్చెలి చెల్మిఁజేయువిందు
గీ॥ కవుల ముంగొంగు హొన్న లోకములకన్ను। పచ్చగుఱ్ఱపువ్రజీఁడు పగటిఱేఁడు
ముగురుమూర్తులరూపు సన్మునులప్రాపు। వెలఁగి వినువీధిఁజనుదెంచెఁ జిత్రలీల॥ 71
గీ॥ అయ్యహోదయవేళ సహర్షలీల। నెలకొనఁగ నూఱడిఁలె బద్మినీవలఁపు
మిందుమతి యాసునందయానందలలిత। కలితవాగ్వృత్తి నొకకొంత కలకదేఱె॥ 72
క॥ పాదుతోఁగల సెగమిగులన్। మోదముగలవాని వేఁడుముల పోడిమిచే
నైదువగల కైదువుగల॥ జోదు వగల మిగుల నొగిలి సొగయుచునుండెన్॥ 73
వ॥ నాపుడుఁ దదనంతరకథావిధానం బెట్టిదనిన॥ 74
చ॥ కురురుకయాళకాళక కొంకణటెంకణసింహళాంధ్రబా
హ్లీకకురుఘూర్జరాదికమహీరమణార్పితగంధసింధుర
ప్రకరతురంగసంఘనవరత్నధనాన్వితమందిరాంగణ
ప్రకటకవీంద్రవర్ణితశుభప్రదసత్కరుణానిరీక్షణా॥ 75
క॥ కాండప్రకాండమదవే, దండపదాతిప్రకాండ తతరణరంగా
ఖండవిజయానుషంగా, చండాసివిఖండితారి జనచతురంగా 76
పృథివీవృత్తం॥ విరాజితయశోధరా! విజితవిద్విషత్సింధురా
పురారినిభవిక్రమా! సుజనభూషితోక్తక్రమా
నరేశ్వరశిఖామణీఖచితనవ్యభూషామణీ!
పరిస్ఫురితవైభవా! సతతబంధురాత్యుత్సవా॥ 77

గద్య

ఇది శ్రీమదఖండసచ్చిదానందకాశీపతిసద్గురుస్వామిచరణారవిందసేవాసమాగతస్వస్వ
రూపజ్ఞానరాజయోగసామ్రాజ్యలక్ష్మీధురంధరజ్ఞానప్రసూనాంబికాకాళహస్తీశ్వ
రకరుణాకటాక్షవీక్షణసంప్రాప్తసారసాహితీబంధుర, బంధురంజనకరచరి
త్రపాకనాటికుల పవిత్రధూర్జటిపౌత్రకాళయామాత్యలక్ష్మాంబి
కాకుమారకుమారధూర్జటి ప్రఖ్యాతనామాంక వేంకటార్య
ప్రణీతంబైన యిందుమతీపరిణయంబను మహాప్రబం
ధంబునందుఁ జతుర్థాశ్వాసము

శ్రీశోభనాచలపతయే నమః

# ఇందుమతీపరిణయము.

## పంచమాశ్వాసము.

క॥ శ్రీరామచరణపూజా, ధౌరంధర్యప్రమోదిత మనశ్శీలా
సారతరసుగుణలీలా, నారీపాంచాల మేఁకనరసన్నృపాలా॥ 1

గీ॥ అవధరింపుము శౌనకాద్యఖిలమునుల, కనుపమస్వాంతుఁడగుసూతుఁడనియెనిట్లు
మఱియు నారఘురాముని, మదిఁదలంచి, ఇందుమతి చాల విరహార్తి నెనయునంత॥ 2

మ॥ తఱుకుందంతపుమేల్పసంతెసల వింతల్ గుల్కు చెంగల్వరా
యల రాచల్వలు చల్లుతిన్నియల యొయ్యారంపుఁదోరంపుఁబ
చ్చలకంబంపుఁగడానిదూలముల మెచ్చన్వచ్చు క్రొమ్మ్యాలరా
బెళుకుంగోడల నిండుచిత్తరువగల్ పెంపొందు పెన్మేడలో॥ 3

సీ॥ బాలార్కబింబడంబవిడంబిజాంబూన, దాడంబరకిరీటమవధరించి
వివిధరత్నవినూత్నవిరచితశృంగార, విమలకాంచనకుండలములు వెట్టి
బాలేందుపరిహాసిఫాలభాగమ్మునఁ, గస్తూరికాతిలకంబుదీర్చి
తెలినిగ్గుపండువెన్నెలజల్లు వెదఁజల్లు, రమణీయకంఠహారములుదాల్చి
గీ॥ కనకకేయూరకంకణకటకహంస, కాంగుళీయకముఖ్యభూషాళి వెలయ
జిలుగుటపరంజివ్రాఁతవన్నెలమెఱుంగు, గొప్పదుప్పటివలెవాటుకొంగులలర॥ 4

సీ॥ కరకనత్కనకకంకణఝుణంఝుణలతోఁ, రమణీమణుల్ చామరములువీవ
హార్షప్రవర్షిసౌహార్ద్రమార్దవలీల, బాలయొక్కర్తు తాంబూలమొసఁగ
భయభక్తివినయసంభ్రమలీల వెలయంగఁ, జెలువయొక్కతె కళాచికవహింపఁ
గరహేమమణినూత్నవలయంబు మొరయంగ, పడఁతియొక్కతె పావడయునొసంగ
గీ॥ రమ్యగాంధర్వవిద్యాధరగరుడధక, విప్రతిభతోడ వేగంటివేల్పుజాడ
సకలసామంతబాంధవసమితితోడ, నవ్యమౌక్తికసింహాసనమునఁ జెలఁగి॥ 5

ఉ॥ అల్లవిదర్భరాజకొలువై చెలువై బలువై సరీతితో
నల్లమునందువేడ్క మననుండి యొకానొకనాఁడు వేడుకన్
జెల్లెలిపెండ్లిసేయుటకుచిత్తమునందలపోసి దిక్కులం
దెల్లనృపాలవర్యులకు నేర్పడఁజాటె స్వయంవరంబొగిన్॥ 6

గీ॥ చాటిమతియనుదగిన రాజన్యవరుల, జన్యవిక్రమవరుల రాజన్యలీల
వెలయఁదోడ్కొని రాఁగల వేఁగువాండ్రఁ, బనుపనంతట శుభరూఢిఁ బ్రౌఢిదనర॥ 7

సీ॥ తిరుచూర్ణపుమెఱుంగు తెలిపట్టెనామంబు, నాసాగ్రఘాలాంతభాసురముగ
కడవన్నియ "యనంతముడులు" డాల్ లంబక, ర్ణద్వయిబలుమాలు నాట్యమాడ
కొనవీనులంటఁ జుట్టినయోరతలపాఁగ, మీసకట్టునయొక వింతనీటుఁ జూప
తండులాదికములఁదగుమూట చేభుజా, దండాగ్రఘన వేణుదండమలర

గీ॥ కాగితెమువకక్కలాఁశులుక ఝ్మదుద్ద, డబ్బులొకకొన్ని గలతిత్తి డెంబుఁ జూప
తగినయొక చిన్ని తామ్రపాత్రంబు దనర, నంఘ్రియుగమునబిల్ల మెట్లమరఁ దొడిగి॥ 8

చ॥ కటినిబిగించి కట్టినచొకాటపుదుప్పటిచల్వకొంగు డాల్
చిటికెనవ్రేలియుంగరపుఁ జిన్నెలతో నెరనీటుఁ జాటఁగాఁ
బటుతరధీరతన్ రఘునృపాలపురంబునకేగుదెంచెవి
స్ఫుటగతిమీఱఁగా ద్రవిడభూసురచారవరుం డుదారతన్॥ 9

ఉ॥ ఎవ్వఁడొ వీఁడు వింతవగ యేర్పడ నెక్కడనుండి యొక్కఁడున్
దవ్వులనుండి పెండ్లివగ దాకొనఁ జేరొకొ నరానికూర్మికో
నివ్వసుధేంద్రుతోఁ దెలుపనిచ్చటికిన్ జనుదెంచెనంచుఁ దా
రివ్వలనవ్వలన్ జనము లెంతయు నద్భుతమందికన్గొనన్॥ 10

చ॥ పురవిభవంబహో! యనుచు భూరి మణీమయసౌధయూథ బం
ధురతరసింధురవ్రజ మనోజ్ఞతురంగశతాంగమాలికా
సురుచిరలీలఁగన్గొనుచు శోభిలు రాజుడి వాణపుంజగా
మెఱుఁగుకడానిబంగరపు మెట్లహజారము పెద్దవాకిటన్॥ 11

గీ॥ అరసి ద్వారపాలుఁడనుపఁగాఁ గక్ష్యాంత, రములు దాఁటి వివిధరత్నఖచిత
రచితచిత్రనూత్నరమ్యవితర్దికా, చకచకల్ దనర్చు చవికలోన॥ 12

సీ॥ రమణియొక్కతె మనోరమణీయగతిఁ బచ్చ, కపురంపువలపు బాగాలొసంగ
భామయొక్కతె మణీభాసుహాటకవర్ణ, వలయంబులులియఁ బావడయొసంగ
చెలువయొక్కతె నిండుచెలువంబు వెలయంగ, జికిలిబంగరుకళాచికభరింప
శ్యామయొక్కతె ఘనశ్యామపింఛసువర్ణ, కలితవరాసురటి చెంగటను విసర
గీ॥ హితులు సెనర్రైననిజపురోహితులు గొలువ, సరససంగీతసాహితీవిహితవిహిత

సుహితకవిబుధమంత్రిసమాజమలర, నిండుగొలువున్న రఘుమహీనేతఁ గనియె॥ 13

ఆ॥ వె॥ కని పరాకు స్వామి! యనుచు సద్వినయము, భయము నెనయఁ బ్రౌఢభాషణముల
సభ్యులభినుతింపఁ జనియె నానృపచంద్రు, సముఖమునకుఁ గొంత చనవు వెలయ॥ 14

మ॥ చనుచున్ భోజుఁడు పంపెనంచును నమస్కారమ్ము గావింప న
జ్జననాథాగ్రణి కట్టువర్గ మొసఁగెన్ సంతోషితస్వాంతుఁడ
య్యెను వాఁడున్ దదనంతరంబ రఘురాజెంతే విచిత్రస్థితిన్
గన నాశోభనలేఖ విప్పి చదువంగాఁ బంపె మంత్రీంద్రులన్॥ 15

సీ॥ శ్రీమన్మహారాజశేఖరబిరుదాంక, రాజితుండౌ రఘురాజునకును
మీయల్లుఁడు విదర్భమేదినీపతి మ్రొక్కి, ప్రార్థిమై బంపు కల్యాణలేఖ
మేమిట సేమంబు మీ శుభస్థితులను, బల్మాఱు వ్రాయించి పంపఁదగును
కైవాత మత్సహోదరి యైనయిందుమ, తికి స్వయంవరము వర్తిలెడివిధము
వ్రాసిపంపితిమి భూవరులకు మత్పురం, బునకు వేవేగ రమ్మనుచు వేడ్క॥
గీ॥ నిపుడు భవదీయనందను నిటకుఁ బంప, వలయు శీఘ్రమ్ముగ వివాహవైభవంబు
దనరునని యున్న వక్కాణవిని ప్రహర్ష, మలర మంత్రులతో డనిట్లనియె నతఁడు॥ 16

తే॥ గీ॥ మనచిరంజీవికి వివాహ మొనరఁజేయ, వలయుఁ గావునఁ బురమెల్ల వలయుఁగతి న
లంకరింపంగఁదగు శిల్పమ్ము నేర్చు, వారలకుఁ జెప్పి త్వరపడవలయు నెందు॥ 17

గీ॥ అనుచు నిట్లువల్కి యా రాజశేఖరుం, డంతిపురముఁ జేరినంత మంత్రి
వరులు పట్టణమున వైభవం బొనరింపుఁ, డనుచు శిల్పిజనులఁ బనుచుటయును॥ 18

సీ॥ తమదొరకీర్తిద్యోతలమెల్ల నిండెని, ట్లనురీతి సుధ మేడలం దలంది
యాలాగె యతని తేజోధికత్వముమించు, ననురీతి హేమకుంభాళినించి
స్వారాజపురలక్ష్మి గారవంబునఁ బిల్చు, కేలునా బిరుదుటెక్కెంబు గట్టి
యరిశౌర్యలీలకు నాపాదు రాయిత్రా, డనురీతిఁ దోరణంబ లవరించి
గీ॥ యలవరించు త్రిలోకంబులైన దీని, కెనయనన్ రాదని జనాళి వినుతిసేయ
నూతనాలంక్రియాతివిద్యోతమాన, ముగ నొనర్చిరి శిల్పులా నగరమణిని॥ 19

సీ॥ ఓరుదీర్చెను కుంకుమోరుపంకిలరేఖ, సొగసూన నొకసూనసురుచిరాంగి
చిగురుఁజల్లెను కేలుచిగురులముత్తెల, డాలుగీల్కొన నొక్క మేలిబాల
రంగవల్లి ఘటించె రంగారుతిన్నెల, నందమొన నొకచిన్ని యన్నుమిన్న
చిత్తరుల్ ఘటియించెఁ జిత్తరంబగులీల, నందంద యొకచానయందమూన

గీ॥ మానవీనకళాన్వితమందిరములఁ, బొందళుకులందు మేడలనిందువదన
లెందఱెందఱుగలరొ వారందఱుపుడు, లలితశృంగారములరించి చెలఁగిరెలమి॥ 20

ఉ॥ అల్లలనాడఁగౌసలునిమందపుఁగీల్జడలున్నటింపఁగా
ఫుల్లనుపాణిపంకరుహకంకణముల్ మణిపాత్రపంక్తితో
పల్లవపాణులయ్యెడ శుభప్రదలీలగృహాంగణంబులం
జల్లిరి గంధసారఘనసారమృగీమదవారిపూరముల్॥ 11

గీ॥ మంజుఘోషాతిశయము రంభానిరూఢి, చిత్రరేఖావిచిత్రతఁ జెలఁగి మఱియు
హేమశృంగారరేఖతో నెనసి మెచ్చఁ, దగియె సాకేతమమరేంద్రునగరమనఁగ॥ 22

గీ॥ అప్పురమున్న పాలుఁడానందరసభరి, తాంతరంగుఁడగుచు నఖిలజనులు
గనుఁగొనంగ వేఁగఁ గడువేడ్కఁ బొదలుమఁ, జెలఁగి పెండ్లికొడుకుఁ జేయుఁడనిన॥ 28

మ॥ కలకంఠీతతిపాటనీటెసయఁగా గాంధర్వమేళంబుగుం
పులుసొంప్రల్ వెలయింపువాద్యరవమంభోరాశిజృంభద్విరా
వలసత్ప్రౌఢిఁ జెలంగ నయ్యజుఁడు రేవన్ బెండ్లిపీఁటన్ వసిం
చె లతాంతన్వితలంటినల్గిడఁగ సుస్మేరాననాంభోజుఁడై॥ 24

గీ॥ అఖిలజనులు యావరాజ్యాభిషేక, వేళఁదలఁపుచు నెంతయు వేడ్కఁ దనర
చెలువలందించు పరిమళసలిలములను, స్నానమొనరించె రఘురాజసూనుఁడపుడు॥ 25

గీ॥ చెలువయొకతె చెలువవలువ చేఁదడియొత్తు మగువయొకతె సొగసు సిగయొనర్ప
వెలఁదిచందనంబు వెలఁదియొకర్తు మై, నలఁదనొకతె ధూపములరఁ జేయ॥ 26

సీ॥ చెవులనెంతయు సితచ్ఛవులనుంజవులెచ్చు, ముత్యాలచాకట్లుముద్దుగుల్క
నెరులనెత్తావిపూసములఁ జెన్నగు మేల్మి, సిగులకిరీటంబు మెఱుఁగుమించ
నురమునను రువైన హారపైనసరి పేనల్, సరిపేనల్ గవనివిస్ఫురణఁజూప
కరములసంతోషకరము లౌమణిసము, త్కరములనలరుకంకణములమర

గీ॥ చూపఱకు వేడ్కలొనరించు సొబగు వెలయు, వెలయొసఁగుజాళువాఁ బ్రాఁతకలిమి నెన్నఁ
గన్నసైకపుదుప్పటికలలు వార, నలరువలరేని చెల్వొనెహావుసుఁబూని॥ 27

క॥ చతురంగసైన్యయుతుఁగా, మతిరంగత్ప్రౌఢిగలయ మాత్యులజతగా
సుతనంగజనిభునవ్విభుఁ, డతిసాంగస్ఫూర్తి వెలయ ననిచెన్ వేడ్కన్॥ 28

శా॥ ఆభూనాథసమారమౌళి శుభలీలాంచద్గతిన్ బందురా
జీభూదైవతపఙ్క్తులన్ మనసురంజిల్లంగ సంభావనా

పరదేవతాకృపావరమతి సర్వదిగ్యాత్ర గావించిన యలఘులెవరు
అవధానవిధుల నీభువిఁ బ్రధానులటంచు స్థిరతరకీర్తిని జెందిరెవరు
మామకగురుల్ బుధేంద్రసన్మాన్యవరులు, సరసతిరుపతి వేంకటేశ్వరవిబుధులు
వారినుతియింపకుండుట పాడిగాదు, గానఁజేమోడ్తు శుద్ధవాగ్గాటికొఱకు
శా॥ శ్రీరామారమణీమణీహృదయరాజీవాప్తబంధుండు శై
లారాతిప్రముఖప్రశస్తసుర సేవ్యార్హైకపాదుండు శ్రీ
గోరాడ్వాహనుఖుండు మాధవుఁ డెదన్ గోర్కుల్ పిసాళింప సు
శ్రీరంజిల్ల వధూవరోత్తములఁ బేర్మిన్మించి రక్షించుతన్ 1
సీ॥ అనుజన్ము లతికౌతుకాత్ములై ప్రక్కలఁ బులిపిల్లలనుబోలె నిలచియుండ
వినయగౌరవములు పెనగొనుమనమున మారుతి ప్రోలను జేరినిలువ
నిస్తారిష్టవసిష్ఠాదిమునివరుల్ మించియు నాశీర్వదించుచుండ
మంగళదాయక సంగీతవాద్యముల్ వారాంగనాకదంబములుసలుపఁ
గనకసుందర వరరత్నఖచితసింహ, పీఠమున సీతతోఁగూడి పేర్మి రాజ్య
భరము గైకొన్న రాఘవుఁ డురుతరంపు, వైభవంబులిడు వధూవరులకెపుడు 2
చ॥ అరిగెదఁ బేరటమ్ముకను నాళులతోమును నేను సభ్యులం
దఱు నిరుదెంచువేళను సదస్సునకచ్చటి కీవురమ్మనన్
సరె యనిసింధుపుత్రిని వెసం గరుణించినవిష్ణు వీ వధూ
వరులకొసంగుఁగావుతఁ బ్రభావిభవాయు రనామయంబులన్ 3
చ॥ ఉరగభుగింద్రమా! వినుమి, యుత్తములెల్లరు నామిరాక నే
యరయుచునుందు రేగవలె నంచుఁ బ్రయాణమొనర్చివచ్చి స
త్వరగతి శ్రీధవుండు ప్రమదప్రదవీక్షణలొప్ప నీవధూ
వరుల ననారతంబు శుభభాకరులంబొనరించుఁగావుతన్ 4
చ॥ సిరికిని జెప్పబోఁడు కవిశేఖరుజేరఁడు శంఖచక్రముల్
మఱచును భక్తవత్సలతమాధవుఁ డన్న ననత్యమంద్రుకొం
ద ఱటులనాడువారిఁ గరిసంబుగఁజూచుత ముందు నీ వధూ
వరులనుబ్రోచి యాపయిని భక్తవశీకరు దృష్టిసంతతుల్ 6

దీపాల పిచ్చయ్య

లాభాన్వితులఁ జేసి నీరలును గల్యాణోత్సవాత్యంత ల
క్ష్మీశుభాగ్యోన్నతిఁ గూడఁ దండమనుచుఁ గూర్మిన్ దండ్రి పంపించఁగాన్॥ 29

క॥ తనులిప్తచందనద్యుతు । లనువొందన్ మందయాన లారతులెత్తన్ ।
ఘనసారవీటికాంచిత । ఘనసారద్యుతులు చెలఁగఁ గా వేడుకతోన్॥ 30

సీ॥ బ్రాహ్మణాశీర్వచః ప్రౌఢితో జోడుగఁ బాటలాధరల పెన్ పాటలలర।
వందిమాగధహృద్య వాక్యారవమ్ముతో శంఖభేరీధ్వనుల్ సందడింప।
బహువిధకాంచనాభరణసుశ్రీలసచ్ఛత్రచామరకాంతి సౌరుమీఱ।
కొమగుంపుజల్లు కుంకుమవసంతములతోఁ జెంగావిపావడల్ చెలిమిసేనయ॥
గీ॥ విప్పగను మెప్పుపూఁబోండ్ల వేల్పుతరుల విరులుగురిసినగతి సౌధ వీధినుండి
చెంగి వెలఁదులు ముత్తెల సేసఁజల్ల, నిందుమతిఁ జెందు మతిని సానందగతిని॥ 31

మ॥ తనకార్యాల్ ఫలియించెనంచు నజుఁడు వ్యక్తస్వచ్ఛందనారూఢుఁడై
జను లాశ్చర్యముతోడఁ గన్గొనఁగ రాజత్సౌధరాజీ వినూ
తన సత్కేతనచంచలాంచల మరుత్సంచారసంచాలితో
ద్రవనాలోకహమటా విదర్భపురిఁ జేరన్ రాజమార్గంబునన్॥ 32

ఉ॥ వచ్చునెడన్ నృపాలసుతవర్యుని మ్రోల మృదంగనిస్వనో
ద్యచ్చరణాంగదారవ మృదంగజతాళజ దిందిమిధ్వనుల్
మెచ్చుఘటించ వారరమణీగణముల్ నటియించె వేశ్యన
య్యచ్చరముద్దుగుమ్మల క్రియన్ సనయాభినయప్రవీణతన్ 33

వ॥ ఇవ్విధంబున నక్కుమారుండు తారక పహాసమాఖ్యాభి రాముండును, శరో
ద్భవప్రసిద్ధసేనాన్యభిఖ్యాస్ఫురన్మూర్తియును, జరమహీభృద్దారణ నిపుణదారుణశక్తి
ధరుండును, సంతత సర్వమంగళాభివర్ధమానుండును నగుచుఁ జందనాగరుధూమఘుమ
ఘుమాయమాన ప్రసూనదామానూనవాసనాసమాగత పరిభ్రమద్భ్రమర విస్ఫురఝుంకా
రపంకరుహనేత్రా విచిత్రతరకంకణ మణిమేఖలాకింకిణీ ఘుణత్కారసింజాన మంజు
మంజీర ఝుణత్కారంబు తోరంబుగఁ బురవీథిం జనుమఁ బునఃపునరాలోకన కుతూహ
లజనానందకర నిజవదనచంద్రమండల మిళచ్చంద్రికా చకచకద్యుతులు గవాక్షస్థిత దిదృ
క్షావిచక్షణ ప్రతీక్షణక్షణాక్షుంచంచలేక్షణాక్షచకోరంబులకు మోదంబొనర్ప గోపుర
రమా హాసిపురరమాపాద నూపురంబైన గోపురంబు బహిరంగణంబున నిల్చి కొల్చినజనం
బులకు జాంబూనదాంబరాభరణగంధమాల్య కర్పూరతాంబూలంబు లొసంగి ఘనఘనా

ఘనగర్జావిజృంభమాణఘనా ఘనభుజాగ్రసమ్మహో మండలాగ్రధారా,విదారిత చలాచలకు
లాచల విశావధిక్కరిజయభేరికా భాంకారంబులు బ్రహ్మాండ భాండంబునిండ రథాంగ
సంరావంబును రజోవ్రజంబును బుండరీకమండలంబును రాజహంసోర్మికాకలకలాలంకర
ణంబునుం గలవాహిని వాహినింబోలెఁ జెలంగఁ జనిచని మార్గంబునందు॥ 34

సీ॥ కిసలయోగ్రసరుహ ప్రసవసౌరభచరద్భ్రమరఝుంకరణ విభ్రాజితంబు
దరదళచ్చలదళాంతరగళన్మధుర విస్ఫురణశాఖావలయ స్ఫూర్జితంబు
పికగరుద్గరుడను స్థితివిరుద్గతివేద్ధగధగద్ద్యుతివయస్తతిరవంబు
విటపవజ్జటితరు స్ఫుటనటత్ప్లవగరాట్పుటుకటత్కృతిసము త్కటరవంబు
గీ॥ నికటకుటజతరువ్రజ నిచుళనిచయ, మంజువంజుళపున్నాగ కుంజపుంజ
తాలహింతాలసాలరసాలజాల, సాలతతి నొప్పు నొకజలాశయము గనియె॥ 35

మ॥ కని యారాజకుమారమౌళి యచటన్ గాఢప్రమోదంబునన్
దన సైన్యంబును దాను నిల్చె విలసత్సౌగంధ్యసాంద్రీభవ
ద్వనజవ్రాతమరందబృందముల నందంబొందుచున్ మందమం
ద నటచ్చారుతరానిలాంకురము లత్యంతంబులై వీవఁగాన్॥ 36

సీ॥ పటుచంద్రకాంతి సుస్ఫటికకాంతిఁ బ్రవాసించు రహిమించుపటకుటీరములు వెలయ
వెలయబ్బురపుఁ గ్రొత్తవిడికెంపురవగలు కలశాలి జిగివాటిగఁ సినెలయ
నెరయందపు సుపాణినీటువాటిలెడి చందువలుచెందోవల సద్యుతులు నెనయ
నెనయశక్యంబన నెసఁగుసాంబ్రాణి ధూపముల వాసనల సంపదలుదనర
గీ॥ తన రమావైభవోజ్వల తానిరూఢి, బ్రేషిగననచ్చటవసించెఁ బట్టణమున
దేవతాపతియట్టులుభూవిభుండు, నిఖిలసౌఖ్యానుభవభూతి నిండియుండ॥ 37

వ॥ అయ్యవసరంబున॥ 38

సీ॥ మధుగంధలుబ్ధ సంభ్రమచరద్భ్రమర ఝుంకారంబులెంతయుఁ గడలుకొనఁగ
కరసముత్క్షిప్త పుష్కరసమూహంబులుగగనలక్ష్మికి వర్షగతిఁజరింప
శింకారవస్ఫార ఝుంకారనినదంబుహరిదంతదంతి దైన్యంబొనర్ప
నానీలగగనస్పృగత్యున్నతాకృతి యంజనాచలరేఖనతిశయింప
గీ॥ కదళిలోనుండిచలిగొండ కొడుకుసరగఁబుడమికేతెంచెననుబుద్ధి పొడమిజనుల
కద్భుతమొనర్పఁ జండవేదండమొకటి కొలనిలోనుండి వెడలెఁదత్కాలమునను॥ 39

వ॥ వెడలి వలుఁగడలఁ బుడమి తడఁబడ నెడనెడఁ బ్రజలు గడగడవడఁకఁగ
డఁకనదరి దండధరభుజాదండచండతరాహితదండము ఖండిత శుండాఖండిత మహీరుహకాం
డంబులు తండతండంబులుగ మహీమండలాఖండల నందనబాణోద్దండవేదండకాండప్ర
కాండకాండంబులపై గాఢంబుగాఁ జప్పుడులుప్పతిలం గుప్పుచు ధరాపరాగంబుగప్పు
చు విప్పుగలపచ్చికబయళ్ల నిచ్చలుఁద్రుళ్లుచు వింతలిడుచు నడుమజనంబుల ధరంబడ
నడఁచుచు నిరర్గళగతిమార్గనిరోధంబుదనర్చుచు బిడారంబులగు గుడారంబుల వెడలం
దిగిచివైచుచుఁ గరంబుతిరంబుగ నుదరోదకంబు కరంబునంబూరించి వెల్లగఁ జల్లుచుఁ
ఘూర్ణద్యుకిరంబును బృహత్కాళివిరాజితంబును నసంఖ్యశంఖాకలితంబును జక్రాభి
రామంబును బద్మినీవిలాసభాసితంబును నగు తద్వాహినియను రయంబున నిర్భయగ
తిం జేరంబులువారుచుఁ దినగునట్టియెడ సైనికనికాయం బుపాయంబున నపాయంబు
లేకుండుతెఱంగున మెఱుంగులు దొరంగలించు భిండివాలతోమరగదాద్యాయుధంబు
ల నాయోధనంబొనర్చినం జడియక మతిమతి విజృంభించుసమయంబున। 40

క॥ అనివారణమయ్యెనహో, యనవారణమునకు మీఱు నేమరనగునే
యనవయ్యెఁగాతపవా, రణనృపనందనుఁడు కడఁక రణభీకరుఁడై॥ 41

మ॥ ఇటు లా రాజకుమారరత్నము మణీహేవాకసౌవర్ణవి
స్ఫుటపాణిస్వనకంకణక్వణనముల్ శోభిల్ల విల్లందియుం
త్రుటిశింజిన్యదితారవంబురుల నస్త్రవ్రాతముల్ గప్పెఁద
త్కటువక్షస్థలకుంభభాగముల దోర్దండైకలీలాగతిన్॥ 42

క॥ అప్పటుతరశరపంక్తుల, నప్పట్టున ముంపఁబడిన యగ్గజరాజం,
బుప్పతిలి వర్షధారల, నొప్పగు ఘనతరనగేంద్రమో యనఁ దనరెన్॥ 43

చ॥ గొనకొని మార్పుఁ దప్పి మఱి కొండవయిన్ గిరణోఘముల్ నిగు
డ్చనగతి నక్కుమారుఁడు వడిన్ నవశాతశరాళి నించినన్
మనమునఁ గొంకులేక యలమత్తగజంబు చలంబు మీఱఁగా
ఘనతరతుండదండమతిగ్రమ్ముచుఁ గ్రమ్మఱ డాయవచ్చినన్ 44

ఉ॥ బాహుబలాఢ్యుఁ డారఘున్ప పాలతనూజుఁ డిదేమిచిత్రమో
యోహరిసాహరించెనగ నోపెడి దిగ్గజమంచు నెంచి యుం
త్సాహముతోడ వింట నొకచండతరాస్త్రముఁ బూనియేయ సం
దేహము దీఱ నగ్గజ మదృశ్యమై దివ్యవిమాన మెక్కు మన్ 45

సీ॥ తన శిరఃకోటీరతపనీయమయరుచుల్ తపనాంశురేఖతోఁ దగఁగలింప
తనహారకేయూరతతచిత్రఘృణిరుచుల్ మణివిమానశ్రీలమాఱుమలయ
తన దరహాస సుందరచంద్రికావళుల్ ముఖపూర్ణకళలతో ముద్దుగుల్క
తన హస్తవీణాగ్రతంత్రీవిరావముల్ మధురగానస్వనమహిమఁ బెనయ
గీ॥ తనతనూదివ్యకాంతి దిక్తటులనిండ, చెంతఁ జ్ఛాయపూబోండ్లు చెలఁగి గోష్ఠి
సలుపఁ జూపఱకెల్ల విస్మయము గాఁగ, కోటిమన్మథలావణ్యపాటవమున॥ 46
క॥ సింధురవిధమెడలుకతన, గంధర్వులరూపుఁ గాంచెఁ గొని దివిసై
బంధురగతివర్తింపుచుఁ గంధరగంభీరనాదగరిమం బలికెన్॥ 47
చ॥ జనవర యే మతంగమునిశాపమునన్ గజరూపమంది యు
ర్వ్యనమునుండి యిట్లు బహువత్సరముల్ రఘునూను నిన్నుఁ గ
న్గొన నటు శాపమోచన మగున్ జనునీవని మౌనివల్కె నే
నును భవదీయదర్శన మనోరథసిద్ధి మదిం దలంపుచున్॥ 48
గీ॥ అజుని గన్గొను టెపుడొ మదాంధవృత్తి, దొరఁగి నిజరూపగతి మన నెఱుఁగు టెపుడొ
యని తలంపుచు మీగురుత్వాతిశయక, టాక్షమున నిజరూప మేనందినాఁడ 49
గీ॥ అఖిలలోకజనులకాహ్లాద మొనరించు, నట్టివాగ్విలాస మలర నెపుడు
సంచరింతుఁ గానసకలదేవతలు ప్రియంవదుండటంచు నంద్రు నన్ను॥ 50
క॥ నీకున్ బ్రత్యుపకారం, బేకరణిన్ జేయువాఁడనిచ్చెదనిదిగో
చేకొను సమ్మోహనశర, మాకర్ణరణంబునం జయంబొసఁగు నృపా॥ 51
వ॥ అని యమ్మహాస్త్రంబు ప్రయోగోపసంహారమాత్రపూర్వకంబుగ నొసంగి॥ 52
క॥ అనఘ కృతార్థుఁడనైతిన్, ఒనియెద సెలవిమ్ము భోజసమాజామణి నిన్
ఘనత వరియించు శుభమగు నని యా గంధర్వుఁడరిగె నద్భుతలీలన్॥ 53
సీ॥ అప్డు దేమిదెల్ప నయ్యుజానిశంఖారావగంభీరజయభేరికా విరావ
గజఘంటికా ఘణంఘణనాదబృంహితహయహేషితస్వనహారిహయాది
వర్షితసుమబృందవాసనాగతభృంగరవదివ్యకామినీరచితగీత
వివిధజనస్తోత్రవితతధ్వనిస్ఫూర్తులేకీభవించి భూలోక దివిజ॥
గీ॥ లోకములకెల్ల విస్మయాస్తోకలీల, మదినెసంగఁగ నవఘూర్ణమానజలధి
రవముచందాన వెలయఁగ రాజసుత వతంస ముచ్చోటుగదలె సంతస మెలర్ప॥ 54

గీ॥ కదలి జనవరు లెల్లెడఁ గాన్కలొసఁగఁ, గైకొనుచు శుభహేతువుల్ గనుచుఁ గొన్ని
పయనముల్ చని కుండినపట్టణంబు, గాంచి యత్యంతసంతోషకలితుఁ డగుచు॥ 55
సీ॥ ఉభయపార్శ్వస్ఫురదవిరళాతిస్వచ్ఛ చామరప్రసవ గుచ్ఛములతోడ
ఘనదివ్యపద్మరాగ వినూతనాతపత్ర ప్రభాపల్లవోత్కరముతోడ
నత్యున్నతస్యందనాగ్రసౌవర్ణ కుంభావళి ఫలభూరుహములతోడ
బహువిధాభరణ సంబద్ధగారుత్మతనవవిధాంశుబహుళ శలాటువులతోడఁ
గీ॥ దనబలంబులు శృంగారవనలక్ష్మి, దెలుపఁ దాన వసంతుని చెలువుఁ బూని
రాజనందనుఁ డా భోజరాజవరాళి, పురమహాగ్రప్రాంగణంబునఁ బొలిచి నిలిచె॥ 56
సీ॥ మగధమాళవమత్స్యమళయాళ నేపాళ పాంచాలకేరళపౌండ్రవత్స
గాంధారసౌవీరకాశ్మీరసౌరాష్ట్ర కురుకరూశకకొంకణాంధ్ర
కర్ణాటకరహాటకాళింగవంగాంగ సింధుఘూర్జర శూరసేనమద్ర
కాంభోజనిషధ బంగాళ లాటమరాటకాంతలావంతి త్రిగర్తముఖ్య
గీ॥ సకలదేశాధినాథులు చంద్రసూర్యవంశసంభవులైన భూవరులు గజతు
రంగ రంగద్విలాసంబు రహిఁ జెలంగ, వచ్చి నిండిరి తత్పురవరమునందు॥ 57
శా॥ ఆ భోజాధిపమౌళి చాల మదిలో హర్షించి గంభీరభే
రీభాంకారము లుల్లసిల్లఁగ ధరిత్రీపాలకశ్రేణికిన్
సౌభాగ్యస్థితిమీఱ మంత్రితతిచే సంస్కారముల్ పన్నె గం
ధేభాశ్వవ్రజభూషణాదికము లెంతే యంతచందంబుగాన్॥ 58
క॥ ఆ రాజవరుఁ డప్పుడు దా రాంత వెలయంగఁ దత్ప్రధానులకెలమిన్
సారమణిభూషణాంబరహారాదు లొసంగి పంపె నంచితలీలన్॥ 59
సీ॥ ద్వారకాగోపీచందనపు మేల్పట్టె వర్ధనముల కరుణాక్షతములు మెఱయ
వలపొందు కరినిగ్గు పొలుపు కస్తురిచుక్క పోడిమి మేలిమిబొట్టు లమర
నును గెంపు గుంపు సొంపానరు బంగరుకొత్తు నెఱకుల మకరకుండలములొనర
నింద్రనీలపు నిగ్గు లెనయు క్రొంబట్టుడాల్ సకలాతి మెఱుఁగు కుళ్లాయి యమర
గీ॥ ధవళయజ్ఞోపవీత సూత్రము లుదనగ, తామ్రపాత్రాది సామగ్రిఁ దాల్చి బ్రహ్మ
చారు లరుదేర వివిధాగ్రహారవిప్రవరులు చనుదెంచి రా స్వయంవరమునకును॥ 60
సీ॥ శివలింగపు మెఱుంగు జవగ్గుగొలుసుల నక్షకాయల గంగు చాకళింప
అపరంజి గుండ్లడాలుపు రవిద్రుమయుక్త రుద్రాక్షదామముల్ రూఢి నెఱప

భసితత్రిపుండ్రాంకఫాలమ్ముల విశాలగంధాక్షతస్ఫూర్తికళలుమిం-
చిటిపొటికటికపుంబటికపుజపమాలికలు బోటవేలియుంగరములారయ॥

గీ॥ హర! మహాదేవ! చంద్రశేఖర! యటంచు, శిష్యగణములు వెనువెంటఁ జెలఁగి నడువ
నరుగఁ జనుదెంచి రా రాధ్యజనులు గొంద, ఱిందుమతి పెండ్లిమహిమ గన్గొందమనుచు॥ 61

మ॥ చిఱునవ్వుల్ దళుకొత్తు నెమ్మొగములన్ శ్రీచూర్ణపుం రేఖ దా
లారపా తిర్మణిపట్టె లుల్లసిల శిష్యుల్ వెంటనంటఁగ శ్రీ
హరినామస్మరణంబులుప్పతిల దాసోహంబటం చొండొరుల్
నరుగన్ వైష్ణవులేగుదెంచిరటకున్ సౌశీల్యసంపన్నులై॥ 62

వ॥ మఱియుఁ జతుస్సముద్రమధ్యంబునం గల నిఖిలవిప్రక్షత్రియవైశ్యప్రముఖజన నికరంబు నిజోచితవివిధాలంకారభాసురంబై యమ్మహోత్సవంబుగనుంగొనఁ బురంబునకుం జనుదెంచి రట్టియెడ॥ 63

సీ॥ జిలుఁగుకాటుకరేఖ జిగికన్నుఁగవడాలు కర్ణలక్ష్మికి నల్లకల్వలొసఁగ
నుదుటికస్తురిచుక్క యుడుటెనిద్దపునిగల్ రంగుముంగురులకొరహిఁ జెలంగ
చిఱునవ్వువెన్నెలల్ చిందుచెక్కులయందు బెళుకుకమ్మలదోయి తళుకు లెసఁగ
గుబ్బకుంభములపూఁతనిబ్బరం బ్రమోఱుంగవలిపెచెంగావి పైటలమెలంగ॥

గీ॥ లేఁతలతకూనలాట మిళిందలేఖ లంటెనా నీలకాంతి వేనలి శయింప
మడిమలానిన సోగక్రీల్ జడలు మెఱయ, వెలవెలఁదులందు వచ్చిరప్పీటికపుడు॥ 64

వ॥ మఱియును॥ 65

సీ॥ తపనీయతాటంక ధగధగప్రభలు ద్యోతలమున దశదిశాతతులు నిండ
వలిపెక్రొంజెలువ దువ్వలువడాల్ నెమ్మేని మంచిగందపుఁబూఁత మహిమ నొరయ
మణిగణస్థగిత కంకణ కనద్ఘృణిపంక్తి పాణిపల్లవరుచిప్రబలి నెఱయ
కంజరాగద్యుతి మంజీరఘనవిభల్ చరణాబ్జములఁ విస్ఫురణ మెఱయ

గీ॥ మర్దళవిరావ తాళసమ్మర్దనినదములర దిక్కులనుండి వారాంగనాళి
తానమరుదెంచెఁ దత్పురీంద్రమునకపుడు వైభవముకోడఁ దగు స్వయంవరముఁ
జూడ॥ 66

చ॥ వర నవరత్ననిర్మిత సువర్ణమనోజ్ఞ విమానపంక్తులన్
హరిహరపద్మసంభవ సురాధిపముఖ్యులు సన్మునీంద్రులున్

వరుసగ నంబరస్థలమునన్వసియించిరి దత్స్వయంవర
స్ఫురణముగ నైనంగ మదిఁబుట్టిన వేడుక లుప్పతిల్లఁ గాన్॥ 67

ఉ॥ ఎక్కడఁ జూచినన్ జన మదేభతురంగమ యోజ్జ్వరావ మే
దిక్కునఁ జూచినం మదవతీమృదుగానజతానమాన మే
చక్కఁ గణించినన్ వివిధచామరకేతనభూషణద్యుతుల్
మిక్కిలివింతచందమయి మెచ్చొనరించె మహాద్భుతంబుగన్॥ 78

ఉ॥ అంచితలీల భోజవసుధాధిపుఁ డప్పుడ బాహ్యసీమ ని
ర్మించఁగఁ బంచె రాజు లెలమిన్ వసియింపఁగ మంచిగాఁ గన
త్కాంచనసూత్న రత్నఘనకాంతితతుల్ తఱుచై నభస్థలిన్
మించు మరుద్విమానతతిమీఁద వసంతపుజల్లుఁ జల్లఁగాన్॥ 79

శా॥ శ్రీరంజిల్లఁగఁ గడ్యభాగములఁ గాశ్మీరంపుఁ గర్పూర క
స్తూరుల్ పూఁతయొనర్చి తిన్నియల ముద్దుల్ గుల్కు ముత్తెల్రము
గ్గారూఢిన్ ఘటియించి చెందొవలడా లందంపుమేల్పందువాల్
తోరంబౌ మణితోరణప్రతతి మందుంగట్టి రా ప్రోలునన్॥ 70

సీ॥ ప్రబలసాంబ్రాణి ధూపములనీలివ రీతి హరినీలమణిలీల లతిశయింప
దవరుకుంకమపూఁత దార్కొన్న చందాన బలుకెంపుజిగిసొంపు పరిఢవిల్ల
చెలఁగుకర్ప్ర ప్రముగ్గు జిలికించునందాన పటువజ్రకప్రభల్ పాదుకొనఁగ
మిగులఁబూదండలు మెఱయించు కైవడి మగరాలనిగనిగల్ సొగసులీన

గీ॥ నవ్యసౌధాళిఁ దనరు నన్నగరమునకుఁ, గ్రమ్మరనొనర్చు న య్యలంకరణ మొసఁగ
నౌర! యిట్టిట్టిదని మెచ్చ నజాతరంబె, అద్వితీయంబు తన్మహిమాతిశయము॥ 71

వ॥ అని యిట్లఖిలజనంబులు వినుతింపుచుండి రట్టియెడ నాభోజుండు వికసిత వదనాంభోజుం డగుచు, నంతఃపురంబునం గలకాంతామణులం గనుంగొని యయ్యందు మతి నలంకరింపుఁ డనిన నప్పుడు॥ 74

గీ॥ ముదితమానస లగుచు నమ్ముదితలెల్ల, విదితమగు వేడ్కఁ దనర వేషేగనపుడు
పెండ్లిపాటలు దనరంగఁ బ్రియమెసఁగ, నెండొరుల సందడింపుచు నుచితలీల॥ 72

క॥ లేవమ్మ ముద్దుగమ్మా రావమ్మ స్వయంవరంబుఁ గంజిలెనీకున్
నీకేలజాగుఁ జేసెద వీవేళ నృపాలవరుల-నీక్షింపఁదగున్ 78

క॥ అలనాఁడునీదుకలలోఁ గలనాథుఁ డజాంగు వచ్చె-గద వేపదవే,
కలనాదగానవినుదిరో పల నాగతిమాని వాని-వరియించుటకున్ 74

క॥ అనుచున్ నెచ్చెలులాడన్ వినుచు న్మదిలోనఁ జెనుము-వేడుక గనుమున్
వనుచు న్నునుసిగ్గున న వ్వనజాననయుండు నంత-వైభవలీలన్ 75

చ॥ ఉరుతరశోభన స్తవము లుల్లసిలన్ ఎటువాద్యవాద్యముల్
మొరయఁగ డానిపళ్ళెరము లో శుభసూచకవస్తుసంచితుల్
మెఱయ నృపాలపుత్రి నొక మేలిమిగన్నపుఁ బెండ్లిపీటపై
సురుచిరలీలనుంచెనొక చొక్కపుముద్దులగుమ్మ యయ్యెడన్ 76

శా॥ హారిద్రద్యుతిభాసితాంగియగు న య్యబ్జాక్షి నెమ్మేనఁ గ
ర్పూరంబున్ మదకుంకుమంబు నెద నేర్పుల్ మీఱఁగా నల్గుఁబె
ట్టారూఢిన్ దలయంటె నొక్కచెలి నృ- త్యత్కంకణారావముల్
మీఱన్ సంపఁగితావినూనియల నెమ్మిన్ గొననల్తింపఁగాన్ 77

క॥ విలసిత సుగంధజలములు కలధౌతపుగొప్పతంబు గల మంచి వడిన్
వలిగుబ్బపైట జాఱన్ జలజాక్షియొకర్తు చెలికి జలకంబార్చెన్॥ 78

సీ॥ నెమ్మేనుదడియొత్తె నెమ్మినెచ్చెలియొకర్తు సంగతిమ్ముగ నుఁగ్రొంజలువయొసఁగె
నెఱులుచిక్కులుదీర్చి విరులసరుల్ గూర్చి యొప్పగానొకచాన కొప్పుపెర్చె
నుదుటకస్తూరిచే యొదటుమీఱఁగ వధూతిలక మొక్కతె వింత తిలకమునిచె
పాపటకేటు సుహాణిముత్తెపుబొట్టు పాటలాధరయొకర్తు నటుపఱచె

గీ॥ తళుకులీనెడునిడువాలు బెళుకుగనుల, నైకముగ నునుకాటుక రేకదీర్చె
వెండిమాచందనంబొక వెలఁదమలఁదె, రాజకులపుత్రికా శిరోరత్నమునకు॥ 79

గీ॥ వీనులన్ శ్రీలు నెత్తమ్మి విరులలేఁత, ముద్దియలుదాల్చెనసఁ జొట్టుముత్తెములును
కేసరాగ్రద్యుతుల్ గల్గు భాసురంపు, హేమతాటంకయుగళంబు భామకలరె॥ 80

క॥ నగుమొగ్గుమోముచంద్రుం డగుట సుధారసపుబిందువని గనుఁగొనఁగా
నొగసుమెఱుఁగాణిముత్తెపు నగ ముంగరదనరెనపుడు వనితామణికిన్॥ 81

గీ॥ తగ్గపూరోత్పలసుగంధ కలనసలరి, ప్రాంతమున నిల్చు భ్రమరశాబంబనంగ
నాసికాగ్రమున నిందువదనకపుడు, వార్వమీఱంగ నీలంపు ముర్వుదనరె॥ 82

గీ॥ కేళినీసతిమదను కెం గేలి విజయ, శంఖమున గద్దెబిరుదునాఁ జెలువుమీఱెఁ
దళుకుజాళ్వామెఱుంగులం దోలకరించు, తీఁగెధరియించె గళమున తీఁగెబోణి 83

గీ॥ గళము కంధరాఖ్య గాంచుటఁ దగ్గళ, దంబుధార లాకు చాగ్రతటుల
దుమికినట్లుతెనరు విమలంబులగు ముత్తె,ముల సరుల్ ధరించె ముదితయపుడు॥ 84

క॥ పటుకంకణహంసకముల్, నటదూర్మిప్రభవహించె నారీమణి యు
త్కట లావణ్యరసాతి, స్ఫుటసరసత్వంబు జూపెఁ జూపఱకెల్లన్॥ 85

వ॥ మఱియు ననేకమణిమయాభరణ సంభరణ ధురీణయగుచు నయ్యిందుమతి యందమతిశయిల్లు చందంబునఁ గ్రొందళుకు కడాని నెత్తమ్మి గద్దియమీఁదఁ దనరు రాయంచ ముద్దియకై వడినలరె నట్టియెడ॥ 86

ఉ॥ పంచశరోపమానుల నృపాలుర నెల్ల స్వయంవరస్థితిన్
మంచికిలకు వసించుఁడని మంచిముహూర్తమునన్ విదర్భరా
జంచితలీలఁబల్క నపుడందఱు నట్లనె పొల్చి రెంతయుం
గాంచనశైలశృంగములఁ గన్పడు దైవతవర్యులో యనన్ 87

వ॥ అయ్యవసరంబున 88

సీ॥ గంధాంధసింధుర ఘంటికారావముల్ దిగ్దంతికర్ణముల్ దీటుకొనఁగ
కాండప్రకాండ రింఖాహేషితధ్వనుల్ సప్తార్ణవీ రవసరణి నెనయ
రటితరథ కటనటచ్చటులచ్ఛటార్భటుల్ పరవీర హృద్భయంకరముగదుర
భేరీమృదంగ గంభీర నాదంబులఁ బద్మోద్భవాండంబు పగిలిచెదర

గీ॥ ధళధళత్కాంతి కాంత కుంతవ్రజంబు, ధగధగద్ద్యుతి చండమార్తాండకిరణ
దండనాఖండ పాండితీ శౌండలీల, వెలయ మగఫాళికై వారములు చెలంగ 89

గీ॥ సరగఁదురగరయోద్ధత స్యందనమున, వేడ్కఁ జనుదెంచె రఘుమహీవిభునిసుతుఁడు
కాంతుఁడో వసంతుఁడో నిశాకాంతుఁడో కొ,యీమహీకాంతుఁడనిజనులెల్లఁబొగడ

శా॥ ఆ వైదర్భుఁడు దెల్పె నయ్యజుఁడు దీవ్యన్మంచరత్నాంచిత
శ్రీవిస్ఫూర్జిత సింహపీఠపయి భూభృచ్ఛృంగభాగంబునం
దావిర్భూతముదంబునన్ వెలయు సింహాంబోయనన్ జేరెఁ బల్
శేవల్ మీఱ నృపాలు రద్భుతగతుల్ డెందంబునం జెందఁగాన్ 90

చ॥ అల రతిదేవి వేఁడుకొన నప్పరమేశుఁడొసంగునట్టి యు
జ్జ్వలతరరూపముల్ గనిన శంబరవైరిక్రియం జెలంగె ని

చ్చెలువపురాచపట్టి సరసీరుహలోచన వీనిఁగాని య
న్యులఁ గడకంటనైనను గనుంగొనునే యని యెంచి రానృపుల్ 92

గీ॥ మణిసువర్ణచిత్ర మహనీయసింహాస, నమున నానృపాల నందనుండు
నలరె నెమ్మి నెక్కి యనువొందినకుమారు, చందమున సమస్తజనులుపొగడ 93

గీ॥ తనయ జత్వంబుదెల్ప రాట్తనయమౌళి, రాజసమెలర్ప ఘనపద్మరాగకలిత
వస్తులమృగేంద్ర పీఠిపై వలనుమీఱి, రాజహంసాశ్రయప్రౌఢి రంజిలంగ 94

క॥ ఆ రాజసునులలోపల, నా రఘునందనుఁడు పొల్చె నతిశయనిజ తే
జోరూఢివైద్యుతద్యుతి, మీఱ ప్రవహించు నూత్నమేఘంబనగన్ 95

క॥ బృందారక బృందములో, నం దనరు పురందరుండనన్ రఘుసూనుం
డందటిలో సురతరుతతి, నందంబగు పారిజాత మనఁ జెలువొందెన్ 96

చ॥ ఇతరనృపాలురన్ విడిచి యెంతయుఁ బౌరజనాళి వీక్షణ
ప్రతతి రఘుక్షితీశసుతుపైఁ బ్రసరించె మిళిందపంక్తి పు
ష్పితతరుబృందమున్ విడిచి శీఘ్రమె వన్యమదేభరాజుపై
నతులితలీల వ్రాలిన యొయారమెలర్ప మహాద్భుతంబుగాన్

ఉ॥ ఎప్పుడువచ్చు నిందుమతి యెప్పుడు వేడుకమీఱఁ జూచు న
న్నెప్పుడు ప్రేమతోడ వరియించునటంచు నృపాలు రొండొరుల్
చెప్పలు వ్రాల్పకెంతయు గుతీన్ దనివారక చూడ నంతన
యొయ్యప్పులకుప్ప మెప్పుగ శుభోదయవైభవలీల రంజిలన్ 98

గీ॥ వికసితాంభోజలేఖిక స్వీతవినూత్న, రత్నపీఠికనుండి వాగ్రమణిదేవి
యంచితగతుల్ చెలంగ రాయంచగుంపు వెంటనంటినగతి సఖీవితతిగొలువ 99

వ॥ నిజమణిమయ సింహాసనంబు డిగ్గి 100

గీ॥ మణివిభూషణదేదీప్య మానఘృణులు, దశదిశల్ ముంచుకొనఁగ నెత్తమ్మి యడుగు
లత్తుకరసంబు భూమిపైఁ గ్రొత్తయైన, మెట్టతామరయై జిగిమించిదనర 101

గీ॥ చెలువముంగలనిల్వఁ గ్రొందళుకుపైఁడి, పాదుకలుమెట్టి కైదండఁ బట్టి మంద
మందగమనంబులలర న మ్మగువమిన్న, రమ్యతరలీలఁ గక్ష్యాంతరములు దాఁటి 102

ఉ॥ కన్నులు బెళ్కఁ బైట వలి గబ్బి చనుంగవ గుల్క సైకపున్
నెన్నడు మల్క మోముజిగి నిద్దపునవ్వులు చిల్కగంబురా

సన్నపుగందపుఁ బలపు చక్కనిమైవెలహెచ్చు జాళువా
వన్నె మెఱుంగురంగు నును వల్వచెఱంగు దురంగలింపఁగాన్ 103

సీ॥ బిరుదకాహళజయ ఢక్కికారావముల్ తోరమై మ్రోయఁ డోరు ఛోరుకలఁగ
చందనాగరుధూపసాంద్రసద్వాసనల్ సుమదామసౌరభ స్ఫూర్తి నెనయ
తనువల్లికాసముద్భవ మనోహరరుచుల్ దట్టమై దశదిశాంతరమునిండ
ధవళాతపత్ర కేతనచామరద్యుతుల్ రహిమించి రోదోంత రముఁ జేరయ

గీ॥ వందిమాగధకీర్తనల్ గ్రందుకొనఁగ, వివిధమర్దళతాళన వీరరవము
నెరయ వారాంగనాతతుల్ నృత్యమాడ, ప్రబలి వేత్రధరుల్ బరాబరులు సేయ 104

చ॥ చల్లఁగ మేనివాసనలు చల్లఁగ దిక్తటులందు నందియల్
ఘల్లనఁ బాణిపంకరుహకంకణముల్ మెఱుడాలు బెళ్కఁగాఁ
బల్లవపాణి యిందుమతి పల్లకిలోపల బంధుకోటి రం
జిల్ల స్వయంవరస్థలికిఁ జేరెను నందు ముదంబు బాసిలన్॥ 105

క॥ ఆ రామామణి నృపవ, ర్యారామవసంతలక్ష్మియనఁ జెలువందెన్
గారా మెనయన్ నిజశ్రృం, గారామేయప్రభ తిగౌరవలీలన్॥ 106

మ॥ తన నేర్పుల్ మెఱయన్ బయోజభవుఁ డీతన్వంగినిర్మించె నే
యని యాశ్చర్యమెలర్ప భూరమణు లత్యంతప్రమోదంబునన్
గనఁగాఁ బల్లకిలోన నిందుమతి శృంగారాంగసంపత్కళల్
దనరన్ బంగరుతళ్కుపావడలు చెంతన్ నెచ్చెలుల్ వేయఁగన్ 107

గీ॥ అందమైన మందమందయానములను, నందవ్రేలు కేలునందముర్చి
యిందువదనయైనయిందుమతి గణంగి, రాజవీధియందు రాఁ దొణంగె॥ 108

క॥ కుందమ్ములకుం దమ్ములు, మందగమనరదనతతు లమ్మగువ నెఱికురుల్
కందమ్ములకుం దమ్ములు, కందమ్ములు మగవచెలికందమ్ములహా॥ 109

క॥ వలమురి గళమ్ము మున సై, వలము కచభరమ్ము చెందొవలమురిపము కే
వలముపదకాంతి చెలికిన్, వలముదితలు సాటి నెనయ నళమే వసుధన్॥ 110

క॥ తొవ లాకన్నులు నీలపు, రవ లా నెఱికురులు బళిర! రాజాననకున్
నవలా నవలావణ్యం, బవల నిఁకే చెలికిఁ గలదె యభినుతి సేయన్॥ 111

చ॥ కలువలతీరు తామరలఁ గగ్గిన సౌరుమెఱుంగు రంగు వె
న్నెలఁగలచెల్వ దీపముల నిగ్గుల జెగ్గు మృగీవిలోకనం

బలచపలత్వముం జెనిచి పొల్పుగులారఁ బరోజగర్భుఁడీ
చిలుకలకొల్కి కన్నుఁగవఁ జేసెఁ జుమీ యనలేని నేర్పుతోన్ 212

గీ॥ కుందకలికాఖ్యఁదగు ననంగుఁడు ధరించు, ప్రదర మెదిరి రదావళి కదరి చెదరి
ప్రథమవర్ణరహితదరగతిని దిరిగి। పెంపటియుఁ దద్ద్రసైక్యంబు సొంపుగనియె 113

శా॥ ఔరా మైజిగి మేలురా నగుమొగం బన్నన్న కన్బెళ్కు ల
య్యారే చన్గవ సైకపుంగవునుతీరర్ఘూరె యేలోకమం
దీరామామణి పాటిఁబోలఁగలదే యెవ్వానిఁ గాంక్షించునో
వారిం జెప్పవశంబె యిజ్జగతి దైవానుగ్రహం బెట్టిదో 114

ఉ॥ నీ కెద మ్రొక్కెనర్చెదను నీరజగంధి యటన్నరీతి న
స్తోకత హస్తయుగ్మమునఁ దోరపుఁ దామరమొగ్గఁ గుంచి బల్
రేకలువీఁకఁ దుమ్మెదల వ్రేటువడన్ వడిఁద్రిప్పెనెంతయున్
రాకొమరుం డొకానొకఁడు రాజముఖీమణి చూచునట్లు గాన్ 115

సీ॥ ఘనభుజగ్రస్త ముక్తాహారదామంబు చంకఁ బెట్టఁగడంగు జనవరుండు
పటుసింహపీఠంబు పాదాగ్రనఖమున రవ మెచ్చఁగించెడి రాజసుతుఁడు
నికటభూమీశుతో నొకకొంత యేకాంతపుఁ బ్రసంగ మొనరించు పుడమిఱేఁడు
పనిలేనిపనినైనఁ బరిచారకుని సైగ సేయఁగాఁ జూచు భూనాయకుండు

గీ॥ బారదుగ దచ్చి యని వచఃప్రౌఢి వనర, నెత్తమాడఁదొడంగెడి నృపకుమారు
లందుఁగన్గొన మఱియు ననేకగతుల, నెల్లనృపతులు చిన్నెలనెనసి రపుడు 116

ఉ॥ వాఁడి మెఱుంగుగోట జనవల్లభనందనుఁ డొక్కఁ డెంతయున్
దీడను గేతకీదళము తీవ్రగతిన్ మఱి వేఱెప్రాయపున్
వాఁడొకఁ డుత్తమాంగమున వైపుగనుంచెఁ గిరీటముయ్యెడన్
బోఁడిమిమీఱ న మ్మెఱుఁగుఁబోఁడి కనుంగొనునంచు వేడుకన్ 117

వ॥ ఇవ్విధంబున వివిధశృంగారచేష్టావిలాసభాసమానులును నసమానసౌందర్య రేఖాసుమశరాసనులు నగు రాజసూనులం గలయం గనుంగొని, తదీయవంశాభిజ్ఞాభిజ్ఞ హృదయారవిందయగు సునంద యిందుమతిం దోడ్కొని మందమందగమనంబున మగధరాజసన్నిధానంబునకుం జని యమ్ముద్దియతో నిట్లనియె 118

గీ॥ అతివ! యీ రాజు మద్రదేశాధినాథుఁ, డధికబలశాలి శరణన్న నఖిలరిపులఁ
గరుణ రక్షించుఁ బరుల దుర్గర్వ మడఁచి, నిక్కముపరంతపాఖ్యఁ జెందినయతండు 119

క॥ ఇతనినిరంతరఘటిత, క్రతువులు దేవేంద్రుఁ డెపుడు గాచుకయుండన్
సతియఁగుఱచి మందాక్, ప్రతతి కురుల్ దాల్ప దితనిప్రౌఢిమ వింటే 120

ఉ॥ అన్వయభూషణంబగు మహామహుఁ డీతఁడు వీనిచేత రా
జన్వతి నాఁ దగున్ వసుధ చంద్రునిచే నిశయొప్పినట్లు యీ
పన్వభృదగ్రగణ్యుని ముదంబున నీవు వరించెదేయనన్
దన్వి మనోభిలాషయుఁ బృథగ్గతి గానఁ జరించె నంతటన్ 121

గీ॥ ఆనృపునిసమ్మతింపమి యల సునంద, యింతి వేఱొక్కనరనాథుచెంతకల్వ
దనరెనపుడొక్కనెత్తమ్మి దాఁటి వేఱు, తమ్మిఁజేరెడి హంసిచందంబుమీఱి 122.

గీ॥ అంతట సునంద వల్కె నో యన్నుమిన్న!, వినుమనుచు రాజవర్యుఁడీజనవరుండు
వీనిసౌందర్యవిభవంబు వేల్పువెలఁదు, లైనఁ గాంక్షింతు రింద్రభోగాఢ్యుఁడితఁడు

గీ॥ గంధసింధురబంధురాంగణుఁ డితండు, కాంతి యౌవన సత్యవాక్కులనవలన
నీకుసరియైనవాఁడు వర్ణించిచూడ, రసికులకునెల్ల రసికుఁ డీరాజసుతుఁడు 124

గీ॥ అంగరాజ్యాధిపతివీఁ డనంగనిభుఁడు, వీనిశాత్రవభామినుల్ విగళదశ్రు
బిందుహారాళికుచముల యందుఁదాల్తు, రెపుడు సూత్రంబులేక యేయిగురుఁబోణి 125

ఉ॥ అంగన! వింటె వీరసమరాంగణధీరుఁ డనంగమించు ని
య్యంగవిభుండు భాస్వదసమాంగనిభుండు యశోజితాహ్వతా
నంగకవాహినీకృతమహాచ్ఛవిభుం డభవాంఘ్రిపద్మసా
రంగనిభుండు శ్లాఘనరాజ్యరుహుండు నృపాలకోటిలోన్ 126

క॥ సంపత్సారస్వతములఁ, బెంపొందినవీనినీవు పెండ్లాడినచో
శంపాంగి! మిగులవెలసెదు, సొంపున శ్రీవాణులకును జోడైయెపుడున్ 127

చ॥ అనినసునందపల్కు విని యాయెలనాగ మఱొక్కరాజుమేల్
వినఁగఁ దలంచి వేడ్కఁ బదవే! పద వేగ విచిత్రలీలతో
నని యటముందటం జనియె నాగద? యానృపవర్యుఁ డెన్నఁగా
మనసిజుఁడే మనంబలరి మానిని? యెంతయుఁ గాంక్ష సేయఁగన్॥ 130

ఉ॥ అంతట నాసఖీతిలకమావనజాక్షికి వేఱొక్క భూ
కాంతునిజూపి చంద్రుక్రియఁ గానఁగనయ్యె నృపాలవర్యుఁ డీ
కంతు నిభుం గనుంగొనుముకామిని! వీని విశాలదీర్ఘ బా
హాంతరమధ్యసౌష్ఠవ వయారి? యొయారముమీఱె నెంతయున్॥ 131

మ॥ అతివా! యీనృపజైత్రయాత్రలఁ దురంగానేకరింఖాసము
ద్ధతభూమీరజముల్ విరోధినరనాథస్ఫారకోటీర ర
త్నతతిం గప్పి తదీయకాంతినడఁచున్ దాదృఙ్మహాశౌర్యుఁడీ
క్షితినాథాగ్రణి శక్యమా నె యితనిన్ గీర్తింప నెవ్వారికిన్॥ 132

క॥ నవతేజశ్శోషితశా, త్రవబలజలరాశి వికసితస్వజనమునః
ప్రవిమలసరోజషండీయినుఁ, డవిరళమహీచక్ర సత్కృతాహ్లాదిసుమీ॥ 132

గీ॥ అనినవిని యానృపాలకన్యాలలామ, నెమ్మనం బానృపాలుపై నిల్పదయ్యె
సౌకుమార్యాతిసౌరభసహితమైన, యలకుముద్వతి సూర్యునియందుఁబోలె॥ 134

చ॥ అటఁజని యావిశాలతరళాక్షి కటాక్షనిరీక్షణాళి యా
త్కటముగఁ గల్వతోరణముగ్రమ్మినయట్లలరంగ వేడ్కనై
కటకధరిత్రి వేలె మహీకాంతుని నొక్కని జూచి త్రోచి పోఁ
గటకట! యాసునంద మదిఁగాంచి సరన్ నృపపుత్రికిట్లనెన్॥ 135

ఉ॥ ఆజిఁ గృశానుఁడెంతయు సహాయుఁడు గాఁ జెలరేఁగి యిమ్మహా
రాజు చలంబునన్ బరశురాముని మార్చిరణోర్విఁ దద్భుజా
రాజితశౌర్యసంపదలరంజిలుచున్ బహుభాగ్యవంతుఁడై
నైజజయప్రతాప తపనద్యుతిభాసిలు రాట్సభాస్థలిన్॥ 136

స్రగ్ధర॥ విద్యుత్కోటీరకోటీ వివిధమణిఘృణీ వేష్టితాంఘ్రిద్వయుండీ
విద్వద్వంద్యుండు ధాత్రీవిభుఁడు బహుయశోవిభ్రమభ్రాజమానుం
డద్వంద్యుం డార్యపూజ్యుం డసదృశసుగుణుండబ్ధిగంభీరభావుం
డద్వైతజ్ఞానధన్యుం డసదృశవిభవుం డంబుజాతాయతాక్షీ॥ 137

గీ॥ ఇతనివరియించెదేయనినిందుఁగనిన, యల్లపద్మినిబోలియవ్వేళఁ జంగ
నాసునంద నృపాలకన్యాలలామ, వేఱొకనృపాలుకడనిల్పి వేడ్కననియె॥ 138

ఉ॥ నీపకులప్రదీపుఁడు వనీపకహస్తనిధాన ముజ్జ్వల
శ్రీపరిణాహవైభవుఁడు సిద్ధపదాశ్రితవాసి యజ్ఞదీ
క్షాపరిణద్ధసువ్రతుఁడు శాంతరసోర్జితదివ్యమూర్తి వి
ద్యాపరుఁ డీసుషేణుఁ డతిధర్మపరుండు నృపాలమాత్రుఁడే॥ 139

ఉ॥ చల్లనిపండువెన్నెలల చందమునన్ విలసిల్లు నిమ్మహీ
తల్లజుకాంతి తేజ మతిదార్ఢ్యగతిన్ రిపుపట్టణంబులం
దెల్ల సుదుస్సహంబగు మహీరమణోత్తముఁ డీనృపాలుఁడు
ఫుల్లసరోజనేత్ర కులభూషణుఁ డెంతయు నెంచిచూడఁగన్ 140

చ॥ చెలియొకవింతవింటె నృపశేఖరుఁడై తగువీని భామినుల్
జలకములాడఁ బో ఘనకుచద్వయి చందనచర్చ లెంత యే
నల యుదకంబునిండ యమునాంబువుఁ బోలుచుఁ జిత్రవైభవం
బలరఁగ గాంగవారిఁ గలయన్ రహిమీఱినరీతి నొప్పెడిన్ 141

మ॥ తరుణీ? నీకెనయైన యుద్ధరణిపున్ దాత్పర్యలీలాగతిన్
వరియింపన్ భవదీయభాగ్యగరిమల్ వర్ణింపఁగాశక్యమే
గురుబృందారకసీమలో మెలఁగుచున్ గోవర్ధనాద్రీంద్ర కం
ధరభాగంబుల వేడుకం గనెడు నృత్యత్కేకి సంఘంబులన్ 142

చ॥ అనవిని యానృపాలతనయామణి వార్ధిఁగుఱించి వేడ్కతోఁ
జనెడునదీవతంస మొకశైలముక్రోవ వసింప కోరసం
చినగతి నానృపుంగడచి శీఘ్రగతిన్ మఱవేఱియొక్కరా
ట్తనయునిచేతనిల్వఁగ ముదంబలరంగ సునంద యిట్లనెన్ 143

సీ॥ స్యందమానోన్నతిఘన స్యందనవ్రజ సుమస్యందనూతన మధూజ్జ్వల ఝరంబు
పున్నాగరమణీయ పున్నాగతిరుచిరత్పున్నాగ సముదాయ భూరితరము
తారాగణవిహారి తారాగలీలాన్వితారాగణితశృంగ హారనభము
కందరాజితమహా కందరాజనిత మాకందరాజీవ సత్కలశుకంబు

గీ॥ తాలతక్కోల సాలహింతాల జాల, జంబుజంబీర పాటలీ ఝాటవాటి
కాకుటీర తటీనట ద్ఘనకులాయ, సాంద్రవైఖరి నొప్పు మహేంద్రనగము 144

ఉ॥ ఆనగపూర్వభాగమున నంబుధియొప్పు ముహుర్ముహుర్నట
న్నక్రకుళీరకచ్ఛప సమేధిత తుంగతరంగ ఘట్టనా
నూనపృషద్వితాన సుమనోఘనమౌక్తిక దానవైఖరుల్
బూని నభోంతరాళమున భూరిరవంబు చెలంగిపొంగుచున్ 145

గీ॥ అన్నగేంద్రంబు తనదుర్గమై చెలంగ, నప్పయోనిధి పరిఖయై యతిశయించ
సంగరాభంగురుండు హేమాంగదుండు, నంగ నితఁడొప్పును గళింగ నాథుఁడెపుడు

గీ॥ అండజసమానయాన యీమండలేంద్రుఁ, దండయాత్రలఁ జండవేదండకాండ
మలరియుండును సంచలదచలరీతి, ఖండపరశుఁడితండు కోదండలీల 146

మ॥ ఘనుఁడీరాజు భుజద్వయిన్ గుణకిణాంకంబుల్ ధరించన్ ద్విష
ద్వనితాసాంజనబాష్పచిహ్నిత పదద్వంద్వ క్రియన్ జాపభృ
జ్జనతాగ్రేసరుఁ డీనృపాలమణి శశ్వద్భోగ ధౌరేయుఁ డీ
తని పాణిగ్రహణంబొనర్పుము నితాంతప్రాభవంబొప్పఁగన్ 148

సీ॥ ఉల్లోలకల్లోల వల్లాలితసరోవరాగతశ్వసన సీమాంతరముల
ముర్మురారావ ముహుర్ముహుర్వలమాన తాళీవనావళిస్థలులజాడ
ఘనసారకదళికా ఖర్జూరపాళికా కమనీయసైకతోత్కరముచాయ
కైతకీకల్హారనూతనాంభోరుహవ్రాతకుల్యానీపవనులత్రోవ

గీ॥ ప్రాక్పయోనిధి వేలావిభాసమాన, తరుణపున్నాగపాటలీతరులనీడ
భావభవకేళిఁ దేలుము భావమలర, నీనృపాలునిఁగూడి రహింజెలంగు 149

క॥ లవలీప్రసూనవాసన, లవలీలం గొనియు మఱి తదంతర్ద్వీపో
పవనాంకురమెలయఁగ నీపవనాధికసత్త్వమొందు బాలా! యనినన్ 151

క॥ ఆవలరాయనిఁ జోడగు, భూవలయాధీశుఁ జూడఁ బోదమనిన దిలా
దా వలపునెంచుచుంజనె, నావల దైవానుకూల్యమటు వడుచుండెన్ 152

గీ॥ చని వధూమణి పాండ్యభూజనవరుండు, మోలనుండంగ నటునిల్చె మోదమలర
నపుడు దౌవారికీరత్నమలవిదర్భ, రాజసహజునకనియె గారవమెలర్ప 153

గీ॥ హారి హరిచందనాలంకృతాంగుఁ డగుచు, వారి ధారానవాతపవ్యాప్తశైల
రాజమున మించె నీపాండ్యరాజమౌళి, వీనిఁగనుఁగొంటివో చాన వేడ్కతోన 154

సీ॥ మధురసత్ఫలనమ్ర మధురమ్యసుమకమ్ర మధురంజిత మహాద్రి మహితవనము
కణికాకరాకీర్ణ కర్ణికాసముదీర్ణ వర్ణికాకీర్ణ స్వర్ణవనజనదము
శారదాభ్రాదభ్ర శారదాద్యుతిశుభ్ర శారదవ్రజరజస్తతపథంబు
పాటీరనగశిరః కోటీర తరురాజి వాటీ రమస్పంద పవనఘనము

గీ॥ తామ్రపర్ణీనదీ సముద్భవవినూత్న, మౌక్తికాలంకృతానేక మందిరాళి
హరిహరావాససౌధ యూధాళిరాజు, ధామ మీరాజసీమ కాంతాలలామ 155

క॥ ఏలా యన్యులఁగోరఁగ, బాలా! దక్షిణసముద్ర బంధురవేలా
దేలావనకుంజములన్, హేలాగతి వెలయు వీని నెనయుము తరుణీ 15

డ నెట్లువారింపఁబడుట తటస్థించును? నిజముగా లేఖలేవచ్చిన ఎవ్వరు చూడకముందుపా లేఖలను సభయందు మేమున్నప్పుడు మాచేతికిఁబడి యుండును. మాకాయుత్తరములందలివార్త కొప్పరపువారేయొప్పుకొనుచు వానిని పత్త్రికాముఖంబునఁ బ్రకటించిరి ఈసంగతులంబట్టి చూడ నీలేఖలు 29 డిసెంబరునాటికి వ్రాయఁబడియున్నట్లెంచవలనుపడదు. నేను వేమవరమునుండి గుంటూరునకువచ్చినతరువాత నాకును సోమయాజులగారికిని రిజస్టరుడుత్తరములు కొప్పరపువారిచే పంపఁబడునని కింవదంతివినియున్నాను. ఆ రిజస్టరుచేసి పంపఁబడుటకుద్దేశింపఁబడినలేఖ లివియేయయియుండునని యూహింతును. కనుక యీలేఖలు 29 డిశంబరునాటికి వేమవరమునకుపంపఁబడిన వార్త యసత్యమనుటుచితమో కాదో సత్యాభిలాషులు తెలిసికొందురుగాక.

కుండినకవిహంసేత్యాది బిరుదాంకితులగు నో కొప్పరపుఁగవిసోదరులారా! మీయందుఁగాని మఱియే యితరకవులయందుఁగాని విద్వాంసులయందుఁగాని నాకెట్టిభావముకలదో మీకునువిశదమైయున్నది. మీసభలయందును మీరుశత్రుభావనతోఁజూచుచున్న తిరుపతి వెంకటకవులయొక్కయుఁ దచ్ఛిష్యులయొక్కయు సభయందును అగ్రాసనాధిపత్యము వహించియున్నవాఁడనని మీఁకుదెలియఁజేయ నవసరమేలేదు. నిరర్థకమునను అన్యాయమునను బరనిందఁజేయరాదని మీరెఱింగియుండకపోరు. తమయందత్యంతాభిమానముగలట్టివారివలననే పరవృత్తాంతమును వినియాపరులప్రవర్తన మిట్టిదని నిర్ణయించుకొనుట క్రమముకాదనియు మీఁకుఁదెలియనివార్త కాదు. మీలేఖలయందున్నన్ని యసత్యములఁగల్పింపసమర్థుఁడను గానని మీరెఱింగియుండవచ్చును. ఎట్లైనను దమకునిజమునిలకడ మీఁదఁదెలియకపోదు.

మఱునాటియుదయమునఁగాని కొప్పరపువారికిఁ దెలియవీలుండదు. వీరి యం దమితాభిమానముగలదని చెప్పిన ధూళిపాళ నరసింహముగారా రాత్రి వేమవరమునందేయున్న ట్లిదివఱకే విశదపఱుపఁబడినది. మఱు నాటియుదయమున నాబసకు వారేవిచ్చేసి కొంతప్రసంగించి యారోజు ఉదయము సాయంకాలము రాత్రిజరిగిన సభలలోనుండుటచే 28 వ డిసెంబరు రాత్రియంతయును 29 వ డిసెంబరు తేదినాఁడుగూడ వేమ వరమునందేయున్నట్లు స్పష్టము. ఈయనయేగాక నాకు స్వయము గాసభయందు లేఖనిచ్చినచిన్నవాఁడు 28 డిసెంబరు తేది సాయంకాల మందును రాత్రియందును, 29 రోజునను జరిగినసభలలో సమస్యనిచ్చి నాలుగుపాదములు చెప్పవలెనన్నాఁడు. కనుక వీరిలోనెవ్వరు 28 డిసెంబరునాటి సోమయాజులగారి ప్రసంగము కొప్పరపువారికి శ్రుతప ఱుపవీలుండదు. మఱియెవ్వరు రాత్రియందు మార్గాయాసమనియెం చక సభయందలివార్త నంతవేగముతో మూఁడుక్రోసులదూరమునం దున్న కొప్పరమునకువెళ్లి చెప్పిరో తెలియదు. అట్లుతొందరపడిపో వునంతటికారణము లేమియున్నవో తెలియరావు. 29 వ డిసెంబరు తేదీయందు నేనొకలేఖనందినవార్త నిజంబైయుండఁగా నితరలేఖల నేనేలయందకుందును. ఈసంగతులవలనను మల్లాది సోమయాజులగారి యుపన్యాసమును సత్యమెఱిఁగి ఖండింపఁబూనిన వారొక్కరైన లేసిదే యొకరిద్దఱున్నారని యసత్యమును ఈలేఖలు వహించియుండుటచేతను ఆలేఖలు నిజముగా 29 డిసెంబరునాఁటికి వ్రాయంబడియున్నట్లే యెంచ వీలుగాకున్నది. మఱియు నీలేఖందెచ్చినవారు ముందుగఁ దిరుపతివేంకటకవులపక్షమువారికి నేలచూపింతురు? చూపించి యందలి యంశములను దెలుపుదురా? అట్లుగాకున్న నాలేఖలుచదువఁబడకుం

మీలేఖలకు వెంటనే సమాధానము వ్రాయుటకేమియుందోఁచక యాంధ్రపత్త్రికయందు మీరు ప్రచురించిన మీరోషావేశమునకు జంకి గ్రుడ్లుమిటకరించుచుఁ గాలహరణంబుసేసి దినదినమాలోచించుకొని నెమ్మదిమీఁద నీసమాధానము రచించితినని మీరనుకొనవచ్చును. మీలేఖలు ప్రచురింపఁబడుదినములలో నాపెత్తండ్రికుమారుఁడును చిన్నతనమునుండి నాశిక్షలోఁ బెరిగి నాయభిమానప్రేమలకుఁ బాత్రమై నాచే వివాహాది సంస్కారములును విద్యయును బొంది యుద్యోగితకువచ్చి నల్గురుబిడ్డలను నాకు మేనకోడలైన వానిభార్యను వదలి పరలోకగతుఁడగు నంతటి దీర్ఘజాడ్యముచే బాధింపఁబడుచుండ వానికుపచారములు చేయింపఁ గొన్నిరోజులు నాకున్న వ్యవధినంతయు వినియోగించి తుదకాశాభంగముకలిగి వ్యాకులితమనస్కుఁడనగుటచేతను అనంతరమాచిన్నవాని యుత్తరక్రియలలోఁ జిక్కుపడియుండుటచేతను, అటుపైఁ గాలేజిలోనితరగతుల పరీక్షలకై ప్రశ్నలనేర్పఱుప గ్రంథావలోడనము సేయుటకుఁ గొంతకాలము వినియోగించుటచేతను సకాలమునకు సమాధానము ప్రచురింపఁబడవలనుపడదయ్యె.

మ॥ తమిఁగన్జేజపుఁడొక్కరుండు శ్రుతిచెంతం దేనెలంజల్కి, మి
త్రమనంబందు నిజంబుకల్లలెఱుఁగక దర్కింపఁగా నీకసం
తమసంబెల్లడఁ బేర్చిసత్యమును వ్యత్యస్తంబుగాఁజూపి, నే
రిమి మీఱంబయిపైకిఁగానఁబడు కూర్మింగెంచి విశ్వస్తుఁడా,॥

మ॥ ఇటునమ్మించెడు కొండెగాఁడు తుదకెల్లన్మోసముంజేసి, సం
కటముల్ గూర్చుచుఁగూర్మినెచ్చెలిహృదిన్ గంపించి,తానంత, చెం
గటఁగాన్పింపక దూరమేగు నిజముల్ కన్పట్టుచుండంగ, నా
డట తన్మానసమందు లేదనుట తథ్యంబంచుఁ దేలున్ సఖా॥

# CXVI

ఆ వె॥ దురభిమానవశ్యుదరిఁ జేర్పరాదయ్య,
అట్టులతఁడు చెంతకరుగుదేరఁ
గొండెకానివృత్తి మెండైననేర్పుతోఁ
జలుపఁజూచి మనసుసంతపించు

చదువరులారా? ఇప్పటికేని గొప్పరవు సోదరుల తప్పుసుద్రాఁ తలయందలితత్త్వముబయలైనదా? ఇప్పటికేని ప్రత్తిపాటికామయ్య గారివ్యాసపుమోసము స్పష్టమైనదా? ఇప్పటికేని పోతరాజులక్ష్మీనర సింహముగారియభూతకల్పనలు భూతిప్రాయమైనవా? అయి యుం డును. మే మింతవఱకుఁ బీఠికవ్రాయుట పునరుక్తిప్రాయమే, అటు లగుట యెఱింగియు 'సెట్టిసేరు, లింగము సవాసేరు" అనుసామెతగా నీపీఠికను వ్రాయుటకుఁ గారణము, మాసోదరు లసత్యమువలనిపట్ట మును, దానివలనియగౌరవమును, దానివలనియిహపరలోకబాధను, దెలిసికొని బాగుపడుదు రనునూహయే కాని వేఱొండు గాదు, ఒక మండలము గాదు గదా? అనంతకోటిబ్రహ్మాండమండలము లేకీభవించి నను నసత్యమునకు గౌరవము నియ్యఁజాలవు, ఇచ్చినను నది కొలఁది కాలములోనే నశించి పోవునే గాని నిల్వ నేరదు. అట్టిచో గుంటూరి మండలములోని నియోగులలో నెవరో కొంద ఱేకీభవంచి యేవ్రా తప్పుడు వ్రాఁతలు వ్రాయుట వ్రాయించుట యనుపొరపాటుపనులకు దిగి సోదరులకు గొప్పదే నెంచిన నది యెంతకాలము నిల్చెడిని. ఆసీ మలో నియోగులలో నెందఱో సజ్జనులు గలరు, వారు యథార్థనివే దకులుగారా? అట్టివారి పవిత్రాక్షరముల నింతకుమున్నుదాహరించి యుంటిమికదా? అంతటితోడనే చదువరులు సంతృప్తి చెందియుండినను

# CXVII

మఱియొక నియోగిశ్రేష్ఠుని యుత్తరము నిందుదాహరించుచున్నారము

శ్రీరాములు

14—6—1913, మార్టూరు.

శ్రీవేదమూర్తులైన బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి—నర్సారావుపేటతాలూకా మార్టూరుగ్రామకాపురస్థుడు మార్టూరు శేషయ్యకుమారుడు సుబ్బయ్య నమస్కారములు— వుభయకుశలోపరి. అయ్యా మాగ్రామమునకు 3 మైళ్లసామీప్యములోనున్న వేమవరం అగ్రహారంలో డిశంబరు 28, 29, 30 తేదీలను జరిగిన శతావధాన సభకు నేనుకూడావచ్చి మూడురోజులువుండి చక్కగాచూచి మంచి చెడ్డల్గ్రహించినవాడనై యున్నాను. అక్కడ జరిగిన న్యాయమైన సంగతులకు విరుద్ధముగా 22-1-1913 వ తేదీని ఆంధ్రపత్రికలో ప్రత్తిపాటికామయ్యగారు వ్రాసినవ్రాత, కేవలము అబద్ధము. ది 8-4-1913, ది 15—2—1913 తేదీలను కృష్ణాపత్రికలో శ్రీసోదరకవులు వ్రాసిన వ్యాసములు, అబద్ధములు, శతావధానము జరుగునప్పుడు సభలో, సోదరకవులు పంపినామనే వ్రాశిన వుత్తరములు,వకరు వారితరఫున తెచ్చుటగాని, ఆతెచ్చినవారలు చదువబోగా, ఆటంకపర్చుటగాని జరిగియుండలేదు, యిటీవల పత్రికలలో చదువుటయేగాని సభలో నీప్రసంగము జరిగినట్టుకనుపించదు ఈలాటిసంగతులు పత్రికలలో వ్రాయుటవల్ల మీకీర్తియేమియు పోనేరదు, యిదివరకే మీఘనత ఆంధ్రదేశము యావత్తు వ్యాపించేయున్నది.— చిత్తగించవలెను - మార్టూరుసుబ్బయ్యవ్రాలు మార్టూరు, నియోగి.

ఈయుత్తరము లెన్నే నిగలవు. ఇది యిటులుండఁగాక, శాఖాభి
మానమాత్రపర్యాప్తులగు నియోగిసోదరులేని యితరులఁబోలికిఁ బోక
సోదరులను గొప్పనుమాత్రము తేనెంచి యేదో "గూడుపురాణేవ్రాఁ
తలకు దిగినచో దానివలన నితరులకు నష్టమంతగా లేకుంటచే నం
దుల కెవరును బాధకులుగారు. ఇందుల కుదాహరణము, పంచాశద
క్షరమాత్రవిజ్ఞాత లగుసోదరులకు "కుండినకవిహంసలు" అనుబిరుదు
నిచ్చినప్పు డింతకు నెన్నిరెట్లో యధికు లగుకవు లాగుంటూరిలో నుం
డియు మన కెందులకని మిన్నకుండుటయే యని యెఱుఁగఁదగు"
అట్లే కాకున్న నాపురమందలి మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారికన్న
శిష్టాహానుమచ్ఛాస్త్రిగారికన్న, బజ్జేపల్లి లక్ష్మీకాంతముగారికన్న నీసో
దరులు కవిత్వమునం దేపాటిఘను లని బిరుదు నిడిరి వీరిదివఱకు ర
చించిన యాశుఘోషయంతయు నాలక్ష్మీకాంతముగారి హరిశ్చంద్ర
నాటకమునందలి యొకపద్యములోని యొకపాదముక్రింద నడఁగి
పోవు నని చెప్పనిప్రాజ్ఞు లేదేశమున నుందురు, గుంటూరి
నివాసు లటులుండఁగా నాకుండినదేశమునం దింక నెందఱు
మహామహులు కలరు? అమరవాది రామకవిగారేమి, మఱి
యునుంగల మహామహులు లేమి సామాన్యులా, వారిముందు వీరిబొబ్బి
లిపాట లాగునా? పైవారు నియోగులు గారు గాన, నియోగులలో
సోదరు లధికు లని యీబిరుద మిచ్చితి మని బిరుదప్రదాత లన వత్తు
రేమో, సమ్మతమే మ॥ రా॥ రా॥ బెల్లంకొండ రామారావుగారు ని
యోగి శిఖామణులు గారా? ఆయనం జెప్పినపిదప వీరి నెన్నివత్సర
ములకేని చెప్ప నొప్పునా?, ఇట్టివారి నెల్ల నవమానించుటకో యన నీ
సోదరులకు "కుండినకవిహంసలు" అనుబిరుద మిడిరను, అది ప్రత్యక్ష

ముగా నితరులను స్పృశించునది కాక పోవుటచే నిందొకరు గాకున్న
వేఱొకరేని "ఎందుల కీబిరుద" మని యడుగ నుద్యమింపరైరి. మే
ముగూడ వారితో పాటిసోదరులగారడీవిద్దెను మన్నించువారిలో వార
మైనను గొంద ఱనభిజ్ఞులు వీరిని మా నెత్తి నెక్కించి యూరేగించవలె
నని యుద్యమించుటయు నందులకు సోదరులుగూడ సిద్ధపడుటయుఁ
దలంచి నహుషుని బ్రహ్మవాహనస్థితిగతుల నాలోచించి సోదరులకవి
త్వతత్త్వమునెల్ల లోకమునకు విశదీకరించి వీరలవస్తుతత్త్వము ననువ
దించి వీరిపన్నికలవలన మాయశమునకుఁ గొలఁది కాలము గలిగిన
యావరణమును నశింపఁ జేసితి మని ప్రాజ్ఞు లెఱుఁగుదురుగాక. ఇది
యిటు లుండ నిత్తము స్వకార్యతత్పరులగు సోదరులెల్లట్లు ప్రవర్తిం
చినను సర్వసమదృష్టిగా మెలఁగఁ దగుపత్రికాధిపతు లసత్యప్రవర్తకు
లుగా నుండుట శోచనీయము దీనింగుఱించి యీపీఠికలో నక్కడక్క
డఁ గొండొక చర్చించి యుంటిమి, అందొకపత్రికాధిపతితో నిటీవలఁ
ప్రత్యక్షముగా మాటలాడి చూచితిమి, ఆపత్రికాధిపతి తననిష్కలుష
త్వమును దెల్పెను దానిస్వరూప మిది "శ్రీవంగిపురంకృష్ణమాచార్యు
లవారివ్యాసము వేసికొనక పోవుట తప్పని నేను మున్మాటికి నెఱుఁగు
దును సోదరులు వారిపేర వ్రాసినయుత్తరములు కల్పితములనియు నె
ఱుఁగుదును, ఈయంశము నిటీవల బాపట్లసభ కరిగినప్పుడు శ్రీసోద
రులతో నేను బ్రత్యక్షములో మాటలాడి కూడ నిర్ణయించుకొని
యుంటిని వారునే నడిగినప్రశ్నలకుఁ దగినయుత్తరము లీయలేదు, ఇ
ట్లు సర్వము నెఱిఁగియు దీనినే బోధించుశ్రీయాచార్యులవారివ్యాసము
ను మాపత్రికయందుఁ బ్రకటింప కుండుటకు గారణాంతరము కలదు."
ఇట్లు ప్రసంగించిరి, ఆయనప్రసంగముంబట్టి చూచినను ఆయనహృద

ముంబట్టి చూచినను, దీనపక్షపాతి యనిమాత్రము మాకుఁబూర్తిగా స్ఫురించినది, బాపట్లమహాసభలో శ్రీసోదరులయాశుధార యుపహాస పాత్ర మగుటకుఁ గూడ నీపత్రికాధిపతి సారెసారె మెచ్చుకొనఁ జొచ్చెను ఆయీహేతువులచే నీయన సోదరు లమాయికులనియు లోకజ్ఞానశూన్యు లనియు నెవ రెట్లు వ్రాయు మన్న నట్లు వ్రాయుటే తప్ప ముందు రాఁ బోవుమంచిచెడ్డల నెఱుఁగ రనియు విచారించుసహృదయులలో నొకఁ డనియు స్ఫుటముగాఁ దెలిసికొంటిమి, అట్లే కానిచో బాపట్లలోనివిరియాశుకవితాదౌర్భాగ్యమునుగూర్చి తాను స్వయముగాఁ జూచియుఁ బ్రకృతము వివాదాస్పద మగునీయంశము దనపత్రికయం దుదాహరింపకుండుట తటస్థింపదు, ప్రత్యక్షమునందుఁ గలిసికొనిన మేము ప్రస్తుతపత్రికాధిపతి హృదయము నెఱిఁగి యింతకు మున్ను పొందిన యభిప్రాయమును మార్చుకో నుంకించినను దూరగు లీయనయెడల సదభిప్రాయమును బొందుట యెట్లు తటస్థించునో మా కరయ రాకున్నయది. ఎవరో యొందులకు? ఈపత్రికాధిపతి మేనమామగారే యీయనవిషయమున వేఱొకవిధముగాఁ దలఁచి యున్నారు ఆయంశము నొక రిట్లు వ్రాసియున్నారు

Guntur
12-6-13

“ ఇదివరకు కృష్ణాపత్రికవారు సోమయాజులగారివ్యాసములో చేసిన మార్పులవిషయమై వ్రాశినాను, చేరే యుండును, తిరిగీ వ్రాయుచున్నాను. సోమయాజులుగారు 5-3-13సం,, తేదీని వారి వ్యాసము దస్కతు చేసి పంపించగా 25-3-13 తేదీగా మార్చుట వకటి, ముల్లాది వెంకటసోమయాజులు, అని దస్కతు చేయగా ‘సోమయాజులు, అని మా

త్రము ప్రశ్నది “టీచరు, ఎ, ఇ, యల్, యమ్, కాలేజీ, అని వ్రాసిన దానిని వేయనే లేదు, యొక్కవిషయము 5, 25 గా మార్చుట,

(చేవ్రాలు,)

పైయుత్తరమువలనఁ బత్రికాధిపతిపై లోకుల కనుమాన ముదయించిన దనుమాటమాత్రము మనము తెలిసికొన వలసి యున్నది, ఆయీమార్పులు పత్రికవారు బుద్ధిపూర్వకముగాఁ జేసి రనుటకన్నఁ బ్రమాదవశమునఁ గల్గిన వనుకొనుట యుక్తము శ్రీమల్లాది వెంకటసోమయాజులుగారిని యిట్లే భావింపఁదగువారు గాని వారివ్యాసమును బత్రికవారు పూర్తిగా ముద్రింపకుండుటచేతను వారికవమానకర మగు శ్రీకొప్పరపుసోదరులతప్పాసుత్తరములను బ్రత్యక్షరము ముద్రించుటచేతను సోమయాజులుగారికిఁ బత్రికవారియం దొకవిధమగు ననుమానము కల్గి యుండు ననియు దానిపైఁ బ్రకృతవిషయము వారిమనస్సున నుదయించి యుండుననియు మన మూహింప వలసి యున్నది. ఎన్నివిధముల నేని తత్త్వము నెఱింగినవారు పత్రికాధిపతుల నపవాదసముద్రమునుండి తొలఁగింపఁ బ్రయత్నింప వచ్చునుగాని వారిస్వహస్తలిఖితాక్షరములు వారియెడల నించుకలోపమున్నట్లు సమర్థింపక మానవు. ఈవిషయమున, బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులుగారికిని, ఆంధ్రపత్రికవారికిని జరిగినయుత్తరప్రత్యుత్తరము లిందుఁ బొందుపఱుచుచున్నారము.

K NAGESWARA RAO,
*Proprietor*

*Telegraphic Address*
"ANDHRAPATRIKA"

# THE ANDHRA PATRIKA

A TELUGU

**ILLUSTRATED WEEKLY**

PUBLISHED EVERY WEDNESDAY

—— o ——

109, FRERE ROAD
OPPOSITE TO NEW GENERAL POST OFFICE,
*Bombay, 30-4-1913*

*No* ——

Dear Sir,

I beg to acknowledge your kind letter and the correspondence accompanying it After closing the correspondence about Vemavarapu Satavadhanam many letters were addressed to this office from both the parties, but to avoid further abuse I stopped the publication of all correspondence on this subject If the columns are once opened there will be no end to the abusive language to find place in the paper Many of the readers of the paper are tired of reading this useless controversy In justice to your good name your contribution should have found a place in the columns of the Andhrapatrika But unfortunately you are reviving the controversy three months after it was closed All those interested in the matter know the truth already To those who are not interested the revival of this controversy will be disgusting I hope you will excuse me for my not publishing the present correspondence During the last three months I have six letters from Kopparapu Poets requesting to publish their correspondence, but I do not wish to open the columns of the paper to this endless controversy I hope you will understand the difficult situation and excuse me for not publishing your correspondence I hope to use it for your own use in an article to be published requesting

the Telugu public to heal up the wounds created by this heated discussion Hoping you are doing well,

Yours truly,
(Sd ) K NAGESWARA RAO

*Letter*

Address —M R Ry MALLADI VENKATA SOMAYAJULU GARU,
*Teacher, A E L M School of Guntur*

——o——

THE "ANDHRAPATRIKA" OFFICE,
109, FRERE ROAD,
*Bombay, 30-4-1913*

*No* ——

Dear Sir,

We regret we are unable to find space for your letter sent two and half months after the event as we stopped all correspondence regarding Vemavarapu Satavadhanam long long ago

Yours faithfully,
(Sd ) (ఇంగ్లీషు దస్కృతు తెలియలేదు,)
*Manager, Andhrapatrika*

(True copy )

*Post Card*

Address —M R Ry MALLADY VENKATA SOMAYAJULU GARU,
*Teacher, A E L M College, Guntur*

——o——

I received your kind letter dated 30th April 1913, stating that you acknowledged my letter and correspondence about Vemavarapu Sathavathanam I am very glad to learn that you do not cherish the idea of opening the columns of the Pathrika with the endless controversy The idea is, of course, very good Your Pathrika was pleased to publish the articles of Kopparapu Poets who therein brought false charge of misrepresentation agaanst me, and another false charge against Mr V Kristnamachariar, the President of the Sabha, When only one side is re-

presented and not the other side, how can this be called a controversy at all ? You say many letters were addressed to your office from both the parties after you closed the correspondence about the Sabha You might have received many letters from Kopparapu Poets and Thirupathi Venkatakavulu I think you mean these two parties by saying both the parties How can I be a party to this when I had sent no letter of mine either about one party or the other ? I bring to your notice that Kopparapu Poets are complainants and that Mr Kristnamachriar and myself are the accused You took the complainant's side and published its articles and refused publishing the correspondence of the defensive side Is this just and impartial ? Is there any limitation for justice ? Do we find anywhere that even the Limitation Act is brought into operation without hearing both the parties ? When it is no controversy at all, how can I revive the controversy three months after it was closed ? What is meant by three months ? The Kopparapu Poets published their offensive articles regarding me and Achariar first in the Kristna Pathrika and then in the Andhra Pathrika I wanted to follow the same course I first sent my correspondence to the Kristna Pathrika and it kept it for long time and then stopped publishing my full article You say that those interested in the matter know the truth already I am at a loss to know how the truth is known even to some when the other side is not allowed to be represented though the authors of the offensive article require answer from me Under these circumstances, I again bring to your notice that, in as much as you once published the charges against me and Kristnamachariar, it will be just to with hold publishing any correspondence only after publishing my answer and that of Mr Achariar, so that the poisoned years of the readers of your Pathrika may be healed up and justice done It is only after waiting so long a time that I have sent my article to your valuable paper Hoping that you will no more regard this kind of peculiar limitation and that you will now at least

think of publishing my article so that justice may not suffer and the wide impartial name of your Pathrika may be preserved

I beg to remain,
Sir,
Yours faithfully,

(Sd ) MALLADY VENKATA SOMAYAJULU

Guntur
3-5-1918

పైయుత్తరము లింగ్లీషులో నున్నవి వీనియర్థము తదజ్ఞులవలన వింటిమి సార మేమనఁగా? శ్రీసోమయాజులుగారు పత్రికాధిపతిని గూర్చి "మాపై సోదరులు నింద మోపుచు వ్రాసిన యుత్తరములను బ్రకటించి యందులకు జవాబుగా నంపిన మా వ్యాసములను మీ రేల ప్రకటింపకుంటిరి, అని ప్రశ్నింపఁగాఁ బత్రికాధిపతి మృదుమధురముగా సవినయముగా,, 'అయ్యా? మేమిదివఱకే యీవిషయమును ముగించుకొని యుంటిమి అందులకుఁ గారణము దీనియందు లోకుల కంత యాదరము లేకుంటయే, తమ వ్యాస మవశ్యమును ముద్రింపఁదగినది యని మే మెఱుఁగుదుము, అయినను ముద్రింపకుండినందులకు మన్నింపవలెను, అని ప్రత్యుత్తర మిచ్చెను ఇంకొకటి చిన్న యుత్తరము, వారి మానేజరు వ్రాసినది, అందులో విశేషాంశము లేవియును లేవు "మేము ప్రకృతవిషయమును నిదివఱకే విరమించి యున్నారము గాన మీ వ్యాసము వేయుటకు వలను పడదు" అని ధార్ష్ట్యముగా వ్రాయఁబడి యున్నది, ఈరెండును జదివికొనినపిమ్మట శ్రీసోమయాజులుగారు "మీరు విరమించుట సక్రమమే యైనను మమ్ము నుద్దేశించి యపవాదలను బ్రకటించిన సోదరులయుత్తరములను మాత్రము ముద్రించి యందులకు సంబంధించిన మా వ్యాసములను ముద్రింపకయే విరమించుటను

దెలుపుమీమాటలు యుక్తియుక్తములు గావు ఇవి చాలన్యాయావి రుద్ధములు, కావున నిఁక నేని మావ్యాసములను బ్రకటించి విషపూరిత ము లగుంలోకులకర్ణములకు శాంతిని గల్గించుట మంచిది దానివలన మీపత్రికకుఁగలమంచిపేరు నిలువఁ గలదు,, ఇత్యాదివచనములతో హితోపదేశప్రాయముగా నొకలేఖ వ్రాసిరి దానిపై వారింతవఱ కునుబ్రత్యుత్తరమీయ రైరి, దాని నీక్రింది యుత్తరము తెల్పును

Guntur

12-6-13

"ఆంధ్రపత్రికవారు వకవుత్తరం నాగేశ్వరరావుగారును మఱి వకకార్డు మానేజరుగారున్నూ వ్రాశినారు సోమయాజులుగారు 3-5-13 తేదీని పైవుత్తరములకు జవాబు వ్రాశినను యింతవఱకు తిరిగి జవాబు వ్రాయలేదు" చేవ్రాలు

ఊరిపితగు పేరిసెట్టిని గోట్టుకపోయినదన్నట్లు" మామా విద్యావివాదవిషయములు పత్రికాధిపతులను బక్షపాతదోషదూషి తులుగా నొనర్చుటకుఁ జాల విచారింప వలసి యున్నది సోమయాజు లుగారు వ్రాసినయుత్తరమునకు జవాబిచ్చుట దుర్ఘటమని నిర్ణయింపని ప్రాజ్ఞ లుండరు. నాగేశ్వరరావుపంతులుగారే కాదు. సాక్షాద్భగవం తుఁడని నిరాధారపువ్రాఁతను వ్రాసి జగమును మెప్పించఁ గలఁడని చెప్ప వలనుపడదు. కావున శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు నిరుత్తరు లగుటయే శ్రేయము పేరి కిట్టినిరుత్తరత్వము నెవరు సంపాదించుచుం డిరో యింతకుమున్నే వివరించి యుంటిమి కాన మరల నావిషయము నెత్తికొనఁ దలఁచము. చదువరులారా? యెంత వ్రాసినను దెమలని ఘూపేక్షిక నెట్లు చమవుదురోగదా? ఇంకను వ్రాయవలసినది బోలెఁ

డున్నది సుఁడీ ఉన్నను జదువరులకు నిప్పటికే నిజము బోధపడి యుం డునని యెంచి ముగింప నెంచుచున్నారము. తటస్థించినంతలోఁ దప్పు డు వ్రాఁతలనెల్ల రూపుమాపి నిజమును నెగడింపఁ గలిగితి మని మే మానందించుచుంటిమి మాకుఁ దటస్థింపని వ్రాఁతలు గొన్ని యుండ వచ్చును. చూపినయాధారములచె వానిని గూడఁ జదువరులు రూపు మాపుదురుగాక. 10 వ జూ౯, 1913 సం॥ సువర్ణలేఖలో వక్ర్టము నరసింహము, అనుచే వ్రాల తో నొకవ్యాసము వెలువడినది అందుఁ బోతరాజు లక్ష్మీనరసింహముగారు వ్రాసినది తప్పుడువ్రాఁత కాదని యు నేను స్వయముగా వేమవరపుసభకు వెళ్ళి చూచితి ననియు ఆయవధానము సర్వవిధముల భ్రష్టయినమాట సత్యమే యనియు నేమేమో వ్రాయఁబడియున్నది. విషయ మిట్లుండఁగా నందెనో బూతుకూఁతలు చేర్పఁబడియున్నవి. తుట్టతుద వ్రాసినసూక్తి నొకదాని నుదాహరించుచున్నారము

"కసిపోవనమ్మ మసెపూసికొనినట్లు" పత్రికా సంపాదకులను ది ట్టుటకంటె "నిట్టిపాడవధానమేల చెసితి రని తిరుపతివెంకటేశ్వరులనే మందలించి, తప్పెచ్చుటనో శిక్ష యచ్చుటనే యను న్యాయము ననుస రింపుఁడు"

అని వ్రాయఁబడియున్నది ఈవక్ర్టము నరసింహమునకు నిం దు దిగవలసిన యావశ్యకతను సుంత వివరింప వలసియున్నది పైను దాహరించిన కారణములవలన నాంధ్రపత్రికాధిపతి పక్షపాతిగా లోక మునకుఁ దోఁచుచుండుటచే నెవరో పత్రికాపారకుఁ డావిషయమున నేదో వ్యాసమును బ్రకటించెను. దానియందలి మందలింపుమాటల ను దిట్లుగా నపలాపించి పైమోటుతనపువ్యాసము పీఁతఁడు గిల్కుచు

ఆ సందర్భములోఁ బోతరాజుగారి నుద్ధరింప నెంచి కొన్నియక్కఱములను లిఖించెను. పోతరాజుగారి వ్రాఁత యసత్యమని యితరులు వ్రాయకుండఁగనే తెలిసికొనవచ్చును పైఁగా నగ్రాసనాధిపతులు పల్చూరి వెంకటసుబ్బయ్యగారు మఱియుంగొందఱు యోగ్యులు లోనగువారు వ్రాసినవిషయములంబట్టికూడఁ దెలిసికో వచ్చును. వ్రాఁతలే విశ్వాస్యములైనచో నీతఁడు వ్రాసినదానినిమాత్రము త్రోసివేసి వారు వ్రాసినదానినే కైకొనుట కేమియుక్తి యుండును అని శంక రావచ్చును. వినుఁడు ఏయుక్తియును లేదు వ్రాయసకాండ్రవ్రాఁతశైలియును గౌరవప్రపత్తులును స్థితిగతులును వ్రాఁతకు మానావమానముల నిచ్చుచుండును గాన వట్టెము నరసింహమే గౌరవపాత్రుఁడని తోఁచినవారెల్ల నతనివ్రాఁతనే గైకొందురనియుఁ దక్కినవారే యట్టివారని తోఁచినవారెల్లఁ దక్కినవారివ్రాఁతలనే కైకొందురనియు నుభయులును దుల్యులని తోఁచినచో నుభయులవ్రాఁతలనుగూడఁ గైకొందురనియు నెంచి యింతతో ముగింపఁ దలఁచుచున్నారము. ద్రవ్యవ్యయము గణింపక కాలహరణమున కోర్చి యింతపెద్దపీఠిక వ్రాసిన మేమీ వట్టెము నరసింహముగారివ్రాఁత నొక్కింత విమర్శించి ఖండించుట కిందవకాశ మీయఁజాలకపోము గాని యితనివ్రాఁతమిగుల నీచాతినీచమై కర్ణకఠోరమగు ప్రల్లదములతో నిండి యున్నది. దీని నేమని విమర్శింపఁ గలము చూడుఁడు.

“(1) నిజము బయలుపడెనని ఏడ్చువారేడ్వ వచ్చును. (2) సన్నిపాతరోగి ప్రలాపించినట్లుగా (3) లంజను నీవు లంజ వనగా నీవే లంజవు. నీఅమ్మ లంజ, నీయవ్వ లంజ, అన్నట్లున్నది. (4) పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా, (5) తగువిధమున బుద్ధి చెప్పబడును”



### కాశీవిశ్వేశ్వరస్వామినేనము.

## వ్యాసనిష్కాసనము.



"వ॥ మీప్రభావంబు మీరెఱుంగుదురు. మాకుఁ జూడ నీవు విశాలాక్షివియు నీయయ్య విశ్వేశ్వర శ్రీమన్మహాదేవుండును గావలయునని (వ్యాసుండు) పలికినవిని యీశాని యతనికి కాశీనగరంబునకుం జేసినయపరాధమ్మునకుం దగిన శిక్ష సేయందలంచి యిట్లనియె"

ఉ॥ ఎట్టు పురాణముల్ పదియునెన్మిదిఁ జెప్పితి వెట్టు వేదముల్
గట్టిగ వేర్పఱించి నుడికారము సొంపెసలార భారతం
బెట్టు రచించితీవు బుధకీ వెట్టులు లోకహితంబుమాత్రలోఁ
బొట్టకు లేక తిట్టితివి పుణ్యగుణంబుల రాశిఁ గాశికన్ 2

వ॥ వారాణసీ మహాక్షేత్రస్థానం బీతీర్థము మీఁద నెవ్వండన్యాయము దలంచు వాఁడు రుద్రపిశాచంబగునని పలికి భవాని భవునిధ్యానసంబు వీక్షించిన.

తే॥ గీ॥ కాశినుండంగ నర్హుండు గాఁడు వీఁడు
వెడలిపొమ్మను మాటలు వేయునేల
క్రోధనుండెట్లు కైవల్యకులగృహంబు
వానివాసంబు కాశికానగరి యెట్లు.

(కాశీఖండము 9 ఆశ్వాసము)

క॥ అన్నమ్ముకోసమేకద!
పున్నముఁబాపమ్మువిడిచి మోఱకువై నీ
వన్నన్న! మమ్ముఁదిట్టెద
వెన్నంగ! స్వహస్తపాక మేశువ రాదే 1

క॥ కాశినిదిట్టిన వాఁడవు
కాశీవిశ్వేశుఁదిట్టఁగా శంకింతే
కాశికకు నన్నపూర్ణకుఁ
గాశీవిశ్వేశునకును గలవేళిదంబుల్ 2

చ॥ విధవలఁగూడటాదిగ నివేకము పాకముతప్పఁబోలు ని
యధమత పూర్తిగాఁదెలిసె నక్కట! కూటికిఁ బాపబుద్ధివై
బుధుఁడవెయయ్యుఁ జత్తమునఁబున్నముఁబాపమెఱింగియున్ వృధా
యధముల త్రోవఁద్రొక్కెదవె యన్నముకోసము పూరిమేసెదే. 3

ఉ॥ ఎంతటివాఁడవి వెఱిఁగి యే సయిరించితిఁగాక యిప్పురిన్
సంతసమొప్ప నిత్యమును షడ్రసపూర్ణముగాభుజించి యా
వంతయుఁ జింతలేక సుఖివై చిరకాలమునుండియుండి నేఁ
డింతకృతఘ్నతన్ సలిపెదే! యిది యెక్కడనుండి నేర్చితో. 4

క॥ ఉపకారం బావంత ద
లఁపవైతి కృతఘ్నతాప్రలాపంబులచే
శపియింపఁబూనితివి నీ
చపలత మాస్వాంత మెఱుఁగఁజాలదె మానీ. 5

తే॥ గీ॥ షడ్రసోపేతముగ భుక్తి సల్పితివను
నీవు శిష్యులునుంగూడ నేఁటికేమి
రేఁపొ మెల్లుండియో మము రేఁగితిట్టఁ
బూనకుందువె నీదగు బుద్ధితెలిసె. 6

చ॥ ఎఱుఁగక నీదుశిష్యుఁ డెవఁడనిఁ గృతఘ్నతకాలవాలమై
గురుపదమైన కాశికనుగూర్చి దురుక్తులనాడుఁగాక యా
మొఱకునుమందలించెదవొ ముందుగ నీవె కృతఘ్నతామహా
దురితములోనఁదూఱెదవొ తొందరమానివచింపు మోముని 7

ఉ॥ భారతము న్ రచించితఁట! పాపముఁ బున్నె మెఱింగియుండు దు
ర్వారకృతఘ్నతాఘపరిపాకము సమ్మతిమెట్టుయ్యె ని
వేరికొ బుద్ధిచెప్పఁదగి యుండదు నేగతిఁబెట్టితయ్య! ని
ధీరత కాల్పనే! యెఱుఁగువానను నెల్లిదమైతినేముని. 8

ఉ॥ ఏయెడనో నటించితఁట! యీయఘమిట్టులెయుండ నాకు నా
రాయణుఁ జెప్పుచుండు, బళిరా! యిదియేగద నీదు తెల్వి, ని
వాయన యెక్కడా యెఱుఁగనా! యెటులెక్కడొ తెల్పుమిప్డు నీ
ధీ యెఱుఁగంగఁజూచెదఁ గుదించెద ని దురహంకృతిత్వరన్ 9

ఆ॥ వె॥ విధవవాఁడఁ గచ్చి విశ్వేశుకన్నను
నధికుఁడన్న నగరె బుధులునిన్ను
తత్త్వమెఱుకవడదొ తబ్బిబ్బొ పక్షపా
తంబొ యేటికిట్టి తప్పువ్రాఁత 10

మ॥ పలుచోట్ల న్నను సన్నుతించి తుదకున్ బ్రాల్మాలి నానాఁట "గా
రెలు చేదయ్యె"నటన్న ఫక్కిక నొనర్తే! నన్నునిందించు ని
తలఁ పేకాశిక మెచ్చునే గురులఘుత్వంబుల్ గనన్ జాల వీ
యిల నీవుం గవివే వివేకివె వివేయూ దీవునిక్కమ్ముగన్ 11

తే॥ గీ॥ పక్షపాతభూయిష్ఠులై పాపమతులు
భువిని యోగులు కొందఱిప్పుడో యొకంట
నన్ను దూషింప నిపందు నున్న నిజము
నెఱిఁగి వారలతోఁ జేరె దేల చెపుము. 12

తే॥ గీ॥ ఎలమిని వసిష్ఠసంబంధ మొసఁగు నీకు
నల్ల నారాయణునియందు నబ్బుటరుదె
పక్షపాతంబు, రాముఁడై పరఁగునతని
కాతఁడేకదా! పురోహితుఁడయ్యె మౌని. 13

శా॥ నీసోదర్యుఁడు కృష్ణునిన్ దఱచుగా నెమ్మి న్నుతించెన్ బర
ప్రాసాదం బతఁడే యొసంగునని యప్రాజ్ఞుండు వాఁ డంత మా
కీసుంగొల్పఁడు జ్ఞానివయ్యు మమునీ వేమంచు దూషింతు ని
న్నే సైరించుటతప్పుగాదె కనఁగొమ్మిమ్మాఁద నీపాటులన్ 14

చ॥ కవనమనంగఁ దత్త్వమెఱుఁగన్వలె నెట్టులొ కూర్చినంతనే
కవియగునే! "రసశ్రుతిని" గానక నన్నుదురుక్తులాడు నీ
సువిసువిసువ్విపాట లెటుశుద్ధరసజ్ఞులుమెత్తురింక నీ
యవగుణ మిప్పురిన్ జెఱుచు నావలకున్ నిను సాఁగనంపెదన్॥ 15

చ॥ వృథగద రామకృష్ణులన వెడ్రుకలం బొకచోలిఖించి య
య్యథములఁబట్టి భాగవతమాడిలి వంతటఁబోక దేవియే
ప్రథమయటంచు నింకనొక భాగవతమ్మునుగట్టి తిట్టినీ
పథమెవఁడనిమెచ్చునె యపాత్రుని నిన్ బురివెళ్ళఁగొట్టెదన్ ॥ 16

చ॥ చవిమెయి భిక్షలిప్పురిని సాపడి జీర్ణముగాకమున్నె తి
ట్ట వెనుకదీయ ఛక్కటకటా! యిటువంటికృతఘ్ను నొద్దఁ దా
నెవఁడొకనాఁడు శిష్యుఁడగునేసిఁ గృతఘ్నుఁడుగాకయుండు నూ
రువెడలిపొమ్ము శిష్యులు గురున్నినుఁ బాతకి వెంబడింపఁగన్॥ 17

చ॥ మతిచెడిసర్వముందెలిసి మాలలుఁ గుక్కలు రోయు నీకృత
ఘ్నతకొడిఁగట్టి శిష్యులను గశ్మలచిత్తులఁజేయుచుంటి భా
రతమిటుదెమ్మ నీవకద వ్రాసతి వందుఁ గృతఘ్నుఁ డెట్టిదు
ర్గతిఁబడునో యెఱుంగఁబడుఁగాక శపించెద వేమి కౌశికా॥ 18

క॥ తప్పొప్పెఱుఁగ వెట నీ
చెప్పెడిటులిఖించినావో యించుకెఱుఁగ వె
ట్లొప్పెదురీక ధీవరునిఁగ
గొప్పకవులు తప్పుదెలిసికొను టిప్పుడనిన్ ॥ 19

క॥ ధీవరసూతిఁ గనుట నీ
ధీవరుఁడవుగాని తెల్విఁ దేటలకలితిన్
ధీవరుఁడవేవ్రకా విటు
తేవేమి భవత్కృతం బదే భారతమున్ ॥ 20

క॥ అని సర్వజ్ఞుఁడు ధర్షిం
చిన గడగడవడఁకి వాక్కుచెడి తడఁబడశి
ష్యువిచంకనున్న భారత
మున నాళీజంఘుచరితమున నిటుచదివెన్ ॥ 21

భారతము, శాంతిపర్వము, కృతఘ్నోపాఖ్యానము.

శ్లో॥ రాజ్ఞశ్చదర్శయామాసు శ్శరీరం రాజధర్మణః
కృతఘ్నం పురుషం తంచ గౌతమం పాపకారిణం॥ 1

శ్లో॥ అథాబ్రవీన్నృపః పుత్రం, పాపోయం వధ్యతామితి,
అస్యమాంసైరిమే సర్వే విహరంతు యథేష్టతః॥ 2

---

(తెల్గుభారతము, శాంతిపర్వము, నాళీజంఘుచరిత్రనుండి)

చ॥ పరిమెయిఁ జాతి వానిఁ గనిపట్టి వధించి శవశకలంగట్టితె
చ్చి రసురభర్తమూఁది యిటు సేరఁగఁ జేసల దీకృతఘ్ను నిక్
బోరి గొని వే తినుండనినఁ బోకడమాలినవారమయ్య, యి
ద్దురిత శరీరముర్ దిసఁగ దోసమువాకని వార లొల్లమిన్ ॥ 1

శ్లో॥ పాపాచారః పాపరత పాపాత్మా పాపసాధన
హంతవ్యోయం మమమతి ర్భవద్భిరితి రాక్షసా ॥ 3

శ్లో॥ ఇత్యుక్తా రాక్షసేంద్రేణ రాక్షసా ఘోరవిక్రమాః
నైచ్ఛంతతం భక్షయితుం పాపకర్మాణమిత్యుత॥ 4

శ్లో॥ దస్యూనాం దీయతామేష సాధ్వద్యపురుషాధమ
ఇత్యూచుస్తే మహారాజ రాక్షసేంద్రం నిశాచరాః॥ 5

శ్లో॥ శిరోభిః ప్రణతాస్సర్వే వ్యాహరన్ రాక్షసాధిపం
నదాతుమర్హసిత్వంనో భక్షణాయాస్యకిల్బిషం॥ 6

శ్లో॥ ఏవముస్త్వితితానాహ రాక్షసేంద్రో నిశాచరాన్
దస్యూనాందీయతామేష కృతఘ్నోఽద్యైవ రాక్షసా. 7

శ్లో॥ ఇత్యుక్తా రాక్షసాస్తేన శూలపట్టసపాణయః
కృత్వాతం ఖండశః పాపం దస్యుభ్యః ప్రదదుస్తదా॥ 8

శ్లో॥ దస్యవశ్చాపినైచ్ఛంత తమత్తుం పాపకారిణం
క్రవ్యాదాఅపి రాజేంద్ర కృతఘ్నం నోపభుంజతే॥ 9

శ్లో॥ బ్రహ్మఘ్నే చసురాపేచ చోరే భగ్నవ్రతేతథా
నిష్కృతిర్విహితా రాజన్ కృతఘ్నే నాస్తి నిష్కృతిః॥ 10

---

వ॥ అతండు॥ 2

క॥ తినుఁడు తినకుండుఁ ద్రైవు, నను జేయుఁడు వీని సేల నాముందటికిం
గొనివచ్చితిరని పలికెన్, దన జాలంపురి వెడలఁ దెచ్చి తద్గాత్రంబున్॥ 3

క॥ వెడకండ సెత్తురోలుకం, బడఁద్రోచి సవచ్చి సుకృపదుపు వెనుకసున్
జడసెఁ గబళింప సుల్లక, కడుపులు నకశకఁబడఁగఁ గొరవము ఖ్యా 4

వ॥ అని చెప్పి భీష్ముండు॥ 5

శ్లో॥ మిత్రద్రోహీ కృతఘ్నశ్చ నృశంసశ్చ నరాధమః
క్రవ్యాదై క్రిమిభిశ్చాన్యై ర్నభుజ్యంతేహితాదృశాః॥ 11

శ్లో॥ కుతఃకృతఘ్నస్యయశః కుతస్థానం కుతస్సుఖం
అశ్రద్ధేయ కృతఘ్నో హి కృతఘ్నే నాస్తినిష్కృతిః॥ 12

శ్లో॥ సత్కారై రుత్తమై ర్మిత్రం పూజయేత విచక్షణః
పరిత్యాజ్యోబుధైః పాపః కృతఘ్నో నిరపత్రప॥ 13
(172—173 అధ్యాయములు చూడఁదగు)

క॥ అనిచదువుచున్న వ్యాసుం
గనియుగ్రుండుగ్రుఁడగుచుఁ గన్నులనిప్పుల్
కనకన మననిట్లను వ్యా
సుని పంచప్రాణము లను సుఱుసుఱుమనఁగన్॥ 20

ఉ॥ ఏమనిప్రాసితీవు నుజీవి యొజ్జుచరించితి నేఁడు నిన్ను ని
ద్దేమియొనర్చినంగలదె యించుక పాపము పో!కృతఘ్న! నీ

క॥ వినుమడియట్టిద కక్కుఱఁ, దినఁగా రోయుఁగ కృతఘ్ను దేహము మాంసం
బని చెప్పనాగమంబులు, మనుజేశ్వర! తెల్లముగ్యో మనకిచ్చోటన్॥ 6

క॥ అని చెప్పితాతయిట్లను, మనుమని కో సాదరమున మతియును బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును, వినుము కృతఘ్నునకులేదు విమలచరిత్రా॥ 7

క॥ అరయమిత్రద్రోహము, దారుణవగుపాతకము కృతఘ్నతకంటెన్
వైరముగొని విడువవలయు, సారెడుదెఱఁగులవారి శాస్త్రులనైనన్॥ 8

శాంతిపర్వము 3 ఆశ్వాసము చూ.

మోమునుజూచుమాత్రన నమోఘ మెనంచు నగుం గృతఘ్నుఁ డీ
గ్రామమునకాసిపోమ్ము నిలదాటిక నీకు మహార్త వ్రాతము౯॥

కం॥ అని ధర్మభంగభీతిని
వనలాత్ముఁ బహామ్మనంగ నాత్మాఘు మెటిం
గిన వ్యాసుఁ డరిగియొక్కటఁ
గనుఁగొనిగోదాతటమ్ముఁ గాశికమఱచె౯॥ 22

తే॥గీ॥ శ్రీగిరీశుఁ డదన్ను సీ,సీ, యటన్నఁ
గాని వ్యాసుండు కౌతమిక దరపించి
కోటిలింగమ్ములేనియు దీటుగావు
కాశికాలింగమునకించుఁ గళవళించు॥ 23

కం॥ వ్యాసునియంతటివాఁ డే
సీసీయనఁబడియె నింకఁ జేటునకేఁడె బల్
దోసము కృతఘ్నతకుఁ దా
వాసవ్రఁడేనియుఁ దాలువక నప్పల్లా॥ 24

కం॥ జగతిఁ గృతజ్ఞతకన్నను
బాగడ్త గనుగుణములేదు పాపంబుకను గృ
ష్ణగుణము కృతఘ్నతకు మిం
చి గనంబడ దిదియె మేటిసిద్ధాంతముగా॥ 25

శ్రీ శ్రీ శ్రీ

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి

